అడ్మిషన్లు జరుగుచున్నవి ! త్వరపడండి ! !

స్థాపితం : 1984 *Phone* 429




# శ్రీ సత్యసాయి విజ్ఞాన్ విహార్

ఇంగ్లీషు & తెలుగు మీడియం రెసిడెన్షియల్

జగ్గయ్యపేట - 521 175 కృష్ణాజిల్లా

* L. K G. నుండి 10 వ తరగతి వరకు
* ప్రభుత్వం నిర్వహించు కామన్ మరియు పబ్లిక్ పరీక్షలందు 100% ఫలితాలను అందించుచున్న సంస్థ
* ఆధునిక పద్ధతులలో ఆడియో, వీడియో సహాయముతో ఉత్తమ శిక్షణ
* మానవతా విలువలను "బాలవికాస్" తరగతుల ద్వారా బోధించుట
* అనుభవజ్ఞులైన అధ్యాపకవర్గం, చక్కటి హాస్టల్ వసతి కలదు.
* శ్రీ సత్యసాయి విద్యాసంస్థల నిర్వహణ తీరు ననుసరించి చక్కటి ఆటపాటలతో, యోగాభ్యాసములతో, నీతిబోధనలతో పిల్లలను పరిపూర్ణమైన ఆరోగ్యవంతులుగా, విద్యావంతులుగా, చక్కటి భావిభారత పౌరులుగా తీర్చిదిద్దుట మా లక్ష్యము.
* అప్లికేషన్ & ప్రాస్పెక్టస్ ఫారము కావలసినవారు రు. 15/-లు D.D. శ్రీ సత్యసాయి విజ్ఞాన్ పేర వ్రాసి పంపగలరు.
* వచ్చే విద్యాసంవత్సరం నుండి మా విద్యాసంస్థ స్వంత ప్రాంగణములో నడపబడుచున్నదని తెలియజేయుటకు సంతసించుచున్నాము.

ఇట్లు

K. Ramakrishna Rao

M A, B Ed,

( Old Student of Bhagavan's College

Brundavan, Bangalore )

జూన్ 1993

సంపుటి : 8

సంచిక : 6

# శ్రీవాణి

సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకుడు-కొమరగిరి కృష్ణమోహనరావు

మేనేజర్
కొమరగిరి చంద్రశేఖర్
24-52, రామానాయుడు పేట
మచిలీపట్నం-521 001
ఫోన్ : 2818

| | |
|---|---|
| విడి ప్రతి | : రు. 4-00 |
| సంవత్సర చందా | : రు. 48-00 |
| 4 సం॥ల చందా | : రు. 175-00 |
| జీవిత సభ్యత్వం | : రు. 600-00 |
| పోషకులు | : రు. 1,116/- |

Cheques Drafts should be drawn in favour of SREE VANI, Monthly Machilipatnam

EDITED, PRINTED & PUBLISHED BY
**Komaragiri Krishna Mohan Rao**

Printed at
SREE VANI PRINTERS
MACHILIPATNAM

## విషయ సూచిక



ముఖచిత్రం :
మహాకవి కబీరు

# స్త్రీలు సమాజసేవకు అంకితం కావాలి

కొల్లిపర ధనలక్ష్మి

ఈనాటి ప్రపంచ జనాభాలో పురుషుల కన్నా స్త్రీలే ఎక్కువని ఈ మధ్య సర్వేలో వెల్లడైనది కనుక సమాజ పురోభివృద్ధిలో స్త్రీల పాత్ర అత్యంత కీలకమైనది. స్త్రీలు చైతన్యవంతులై తమ వంతు బాధ్యతలను సక్రమంగా, సవ్యంగా పోషించుకున్నట్లయితే ఈనాడు ప్రపంచంలో జరిగే దుర్మార్గములలో కొన్నింటినయినా అరికట్టటానికి అవకాశముంటుందని, దేశాన్ని నడిపించే బాధ్యత స్త్రీల చేతులలో ఉన్నట్లయితే ఇంత అవినీతి పెరిగి వుండేది కాదని, ఉన్నత పదవులను స్త్రీలు అలంకరించినట్లయితే, ఆఫీసులలో పనులు జాప్యం లేకుండా జరిగిపోతాయని ఈ మధ్య జరిపిన సర్వేలో పలువురు రాజకీయనాయకులు అభిప్రాయ పడినట్లు " ఇండియా టుడే " లో చదివాను ఇది వాస్తవమే ఝాన్సీ లక్ష్మీబాయి, రుద్రమదేవి లాంటి వీరవనితలు ధైర్య పరాక్రమాదుల విషయంలో శభాష్ అనిపించుకోలేదా ? ఇందిరా గాంధీ, సిరిమావో బండార్ నాయక్, మార్గరేట్ థాచర్, బెనీర్జీర్ భుట్టోలు దేశాలను ఏలి పేరు ప్రఖ్యాతుల నందుకోలేదా ? ప్రాచీనకాలంలో మైత్రి, గార్గేయి, ఉభయ భారతీలు పురుషులతో సమానంగా పాండిత్య ప్రతిభను చాటి ప్రశంసల నందుకోలేదా ? ఇంతటి మేదాసంపత్తి, ధైర్యసాహసములు ప్రదర్శించిన వీరవనితల వారసురాలైన స్త్రీలలో ఈనాడు కొంతమంది తమ బాధ్యతలను విస్మరించి, స్వార్థ సంకుచిత భావాలతో వ్యవహరించటం వలన సమాజ పరిస్థితి నానాటికి దిగజారిపోతున్నది

స్త్రీ జీవితం కుమార్తెగా, భార్యగా, తల్లిగా, ఆడబడుచుగా, అత్తగా - ఇలా మగవాని జీవితంతో పెనవేసుకొని ఉంటుంది తల్లిదండ్రులకు ముద్దుల కుమార్తెగా గారాబాల పట్టిగా పెరిగి పెద్ద అయి వివాహము అయిన తరువాత, భర్త చెంతకు చేరి, అది కావాలి, ఇది కావాలి మావారు అది తీసుకొని రమ్మన్నారు, ఇది తీసుకొని రమ్మన్నారని నిత్యము తల్లిదండ్రులను వేధిస్తున్న కుమార్తెలు ఎందరు లేరు ? ఆ తరువాత ఆడపడుచు లాంఛనాలని కోరటం, మరి కొంతకాలం తరువాత అత్తగారి హోదాలో వరకట్నాల కోసం డిమాండ్ చేసేవారిని ఎంతమందిని చూడటం లేదు ? అది కావాలని ఇది కావాలని భర్తలను పీడిస్తున్న భార్యలు ఎందరు లేరు ? వచ్చే ఆదాయంలో భార్యల కోరికలను తీర్చలేక అవినీతికి పాల్పడే భర్తలు ఎందరు లేరు ? అత్త కూడా ఒకనాటి కోడలిననే వాస్తవాన్ని విస్మరించి కోడళ్ళను బాధించే అత్తలు ఎందరు లేరు ? పిల్లల బాధ్యతలను విస్మరించి, సమాజ సేవ అని తిరిగే తల్లులు ఎందరు లేరు ? ఈ విధముగా వివిధ స్థాయిలలో స్త్రీలు తమ వంతు కర్తవ్యాన్ని, బాధ్యతలను విస్మరించడం వలన మొట్టమొదట కుటుంబంలో అశాంతి నెలకొని, దాని ప్రభావం సమాజం మీద పడుతున్నది స్త్రీ శక్తి వృధా అయిపోతున్నది కనుక స్త్రీలలో సహజంగా అంతర్గతంగా ప్రకాశిస్తున్న శక్తిని సంకుచిత స్వార్థ స్వప్రయోజనాలకు వినియోగించకుండా, సమాజ హిత కార్యక్రమాల వైపుకు మరలించితే ఆ సమాజానికి మంచి చేకూరుతుంది సమాజానికి శ్రేయస్సు చేకూరాలంటే వ్యక్తి మనస్సు ప్రప్రథమంగా మారాలి వ్యక్తి మనస్సు మారినప్పుడు కుటుంబంలో శాంతి చేకూరుతుంది అప్పుడు సమాజం సుఖ శాంతులతో విలసిల్లుతుంది. కుటుంబానికి మూలం స్త్రీ ఈనాటి సమాజంలో స్త్రీల సంఖ్య ఎక్కువ కాబట్టి, మొట్టమొదట స్త్రీ మారాలి ఆ విధంగా మారి కుటుంబ క్షేమాన్ని దృష్టిలో పెట్టుకొని సమాజ సేవకు స్త్రీలు అంకితం కావాలి అప్పుడే సమాజం సర్వతోముఖంగా అభివృద్ధిగాంచుతుంది

## అందరికీ నమస్కరించి.....

శ్రీవాణి శత సంచిక (ఏప్రియల్ '93) అందలేదని చాలామంది వ్రాసినారు. మా పొరపాటు ఏమీ లేదు. అందరికీ Post చేసినాము ప్రత్యేక సంచిక కావటంవలన మధ్యలో ఏవరైనా సంగ్రహించారేమో ! వారుకూడా చదవాలనే కుతూహలంతో సంగ్రహించి ఉంటారు. వారికి కూడా నా ధన్యవాదములు. అయితే "పిల్లికి చెలగాటం, ఎలుకకు ప్రాణసంకటమంట" నా పరిస్థితి కూడా అదే విధంగా ఉన్నది. రు 15 లు విలువచేసే ప్రత్యేక సంచిక, చందాదారులకు కేవలం రు 4/-లకే యిచ్చాం Postage మరి అదనం ఏది ఏమైనప్పటికీ అందలేదని వ్రాసినవారందరికీ మరల శత సంచికలు పంపినాము ఇకపోతే మే సంచికలో పెట్టిన భగవాన్ బాబా వారి ఫొటో చాలా బాగున్నదని ప్రశంసిస్తూ లేఖలు వ్రాస్తున్నారు ఆ ఫొటోలను శ్రీ వి. వి యస్ రామశర్మ ( L I C Rajkot ) గారు అందించినారు పాఠకులందరి తరపున వారికి నా ధన్యవాదములు.

భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు గత సంవత్సరం చేసిన వేసవి తరగతుల దివ్య ప్రసంగాలు పదునాలుగు పాఠకులకు యథాతథంగా అందించబడినాయి మరల ఈ సంవత్సరం యిచ్చిన వేసవి తరగతులలోని దివ్య ప్రసంగాల నన్నింటినీ శ్రీవాణి పాఠకులకు అందించ సంకల్పించుకొనినాను. వేసవి తరగతుల ప్రారంభోత్సవ ప్రసంగమును ఈ సంచికలో అందించుచున్నాను. కనుక శ్రీవాణి చందాదారులు తమ బంధుమిత్రులకు కూడా శ్రీవాణిని పరిచయం చేసి, క్రొత్తవారిని సభ్యులుగ చేర్పించి భగవాన్ బాబా దివ్యప్రబోధాలను అందించే ప్రయత్నం చేస్తారని ఆశిస్తున్నాను వేసవి తరగతుల ప్రసంగాలతోపాటు, వివిధ పండుగల సందర్భంలో భగవాన్ బాబావారు చేసే దివ్య ప్రసంగాలు కూడా శ్రీవాణిలో అందించబడుతాయి. కనుక ప్రతి చందాదారుడు కనీసం ఒకరు లేక ఇద్దరు మిత్రుల చేత క్రొత్తచందాలను చేర్పించి పంపి యీ సదవకాశమును సద్వినియోగపరుస్తారని ఆశిస్తున్నాను, ఏప్రియల్ నుంచి మూడు క్రొత్త శీర్షికలు ప్రారంభించినాం 1) డా॥ జి వి సుబ్రమణ్యంగారి "సాహిత్యవాణి", 2) శ్రీజానమద్దివారి "రసపద్ఘట్టాలు", 3) శ్రీ కె ఎస్ రత్నాకర్‌గారి "చాణక్యుని మాణిక్యాలు". కనుక శ్రీవాణి చేస్తున్న సాహిత్య, సాంస్కృతిక, ఆధ్యాత్మిక ప్రచారమునకు చేయూతనిచ్చి తమవంతు కర్తవ్యాన్ని నిర్వర్తిస్తారని విశ్వసిస్తున్నాను

"మంచిని గ్రహించండి"

"మంచిని పోషించండి !"

"మంచిని పెంచండి !"

"పదిమందికి పంచండి"

ధన్యవాదములు

సదా సాయి సేవలో ...

కొమరగిరి కృష్ణమోహనరావు

శ్లో॥ తత్త్వం కిమేకం ? శివ మద్వితీయం
కిముత్తమం ? సచ్చరితం యదస్తి
త్యాజ్యం సుఖం కిం ? స్త్రియమేవ సమ్యక్
దేయం పరం కిం ? త్వభయం సదైవ ॥

సామాన్యంగా తత్త్వం అంటే ఒక వస్తువు యొక్క లేకపోతే ఒక జీవి యొక్క సహజమైన స్వభావమనుకోవచ్చు. కాని, అసలర్థం అది కాదు. తత్ అంటే అంతటా అన్ని కాలాల్లోను శాశ్వతంగా వ్యాపించి యున్న భగవంతుడు. దాన్నే బ్రహ్మ పదార్థమని అంటారు. ఆ బ్రహ్మ పదార్థము యొక్క సహజ స్వభావాన్నే తత్త్వం అంటారు. అంటే పరమాత్మ

# అమృతవాణి
## కూచిభట్ల చంద్రశేఖరశర్మ

యొక్క స్వభావగుణమన్నమాట. ఆ తత్త్వం అంతటా వున్నది ఒకటే. అంటే మరొకటి లేకుండా తానొక్కటిగానే వ్యాపించి స్థిరమైనది పరమాత్మ భావమని. ఆ పరమాత్మ భావం ఎలాంటిది? అని ప్రశ్న యిక్కడ.

ఆ పరమాత్మ తత్త్వం మంగళరూపమైనది. తన కంటే వేరుగా మరొకటి లేనిది. దానిని దేనితోను పోల్చటానికి వీలుకానిదన్నమాట. అది అలాంటిది. దానికదే సాటి.

అలాగే మనకు నచ్చినదాన్ని చూచి యిది వుత్తమం అని అంటాం. తీరా చూస్తే అది మనకు వుత్తమం కావచ్చు, కాని, మరొకరికి వుత్తమం కాకపోవచ్చు కదా? కనుక అందరి దృష్టిలోను కూడా వుత్తమం అనిపించుకొని వుండేది యేది అని మరో ప్రశ్న వేసినప్పుడు దానికి సమాధానం సచ్చరిత్రం అని చెప్పవచ్చు.

సచ్చరిత్రము అంటే మంచి నడవడి. మంచి నడవడి యెవరైన కోరుకుంటారు. బుద్ధిమంతులందరికీ సన్మార్గమంటే యిష్టమే. కనుక మంచి నడత అనేది వుత్తమమైందని భావం.

రకరకాల సుఖాలనుభవిస్తున్నారు జీవులు. కాని వాటిల్లో వదిలిపెట్టాల్సిన సుఖమొకటి వుంది. అదే స్త్రీ సుఖం. అంటే చేసుకున్న భార్యను వదిలేయటమని కాదు. స్త్రీ వ్యామోహమని అర్థం. ఎందుకంటే కామమనేది మనిషిని వెంటనే పతితుణ్ణి చేస్తుంది. కామాన్ని జయించినవాడే గొప్పవాడు. దాన్ని వదలనంతకాలం తత్త్వం తెల్సుకోలేడు. తత్త్వం తెల్సుకోవటమే జ్ఞానం. దానికి ప్రతిబంధకమే యీ కామం.

ఇలాగే మనం యితరులకెప్పుడు ఇవ్వవలసిందేమిటో తెలుసా? అభయం. ఎవరివల్ల యెవరికీ భయం కలగరాదు. ముందు మనవల్ల ఎవరికి భయం కలగకూడదు. భయం కలవాళ్ళకు మనం భయం తీసేయాలి. అంటే నిన్ను చేరి ప్రతివాడూ తన భయాన్ని పోగొట్టుకోవాలి. నీవు ఇతరులకు కష్టంలో నష్టంలో సహాయపడాలని తెల్సుకో. అప్పుడు వాడికి భయం పోయి శాంతి కలుగుతుంది 

# ఆచరణలో మానవులం కావాలి !

**భగవాన్ బాబా దివ్య సందేశము**

కరోతి దుఃఖే నహి కర్మ తంత్రం
శరీరమాద్యం భోగః అహర్నిశం సః
శరీర భిన్నః పురుషార్థ నిశ్చితే
కావత్ర భోగహాన్ పురుషేనముద్యతే

**విద్యార్థులారా !**

మానవుడు రాత్రింబవళ్ళు శరీర సుఖముల నిమిత్తమై అనేక శ్రమలు పడుతున్నాడు ఆత్మ శరీరం కంటే భిన్నమైనదనే సత్యాన్ని గుర్తించినటువంటి వ్యక్తి ఏ బాధలకూ గురికాడు విజముగ ప్రపంచంలోని ప్రతి మానవుడు తన యొక్క మానవత్వాన్ని, మానవతకు అర్థమును చక్కగా గుర్తించిన ఈ విధమైన శ్రమలు జగత్తులో వుండేటటువంటివి కావు మానవ జీవితము నందే పుట్టి మానవ సమాజమునందే జీవితాన్ని అనుభవిస్తూ, "మానవుడు" అనే పదమునకు అర్థం తెల్పుకోకుండిన, అట్టి మానవుడు పశు పక్షి మృగాదుల కంటే హీనమని ఉపనిషత్తులు బోధించాయి. మానవత్వం అద్భుతమైనటువంటిది, అనంతమైనటువంటిది, వంతమైనటువంటిది మానవుడనగా కేవలం భౌతిక శరీరధారి మాత్రమే కాదు శరీరము, మనస్సు, ఆత్మల యొక్క చేరికే మానవత్వం. శరీరం కర్మ నాచరించటం, మనసుతో దానిని తెలుసుకోవటం, ఈ రెండింటి సాక్షీభూతంగా ఆత్మ వుండటం - ఈ మూడింటియొక్క చేరికే మానవత్వం చేయుట, తెలుసుకొనుట, పొందుట ఈ మూడింటి త్రిశక్తియొక్క బాధ్యత అవ్యక్తమైనదే ఈ మానవత్వం కనుక మానవత్వమనగా తెలియనిదని భావించటం మూర్ఖత్వం

మానవుడు తనయొక్క మానవత్వాన్ని ఏ విధముగా వ్యక్తం చేసుకోవాలి ! ఏ విధముగా గుర్తించాలి ? ఏ విధముగా వర్తించాలి ? అనేటటువంటి త్రిమార్గములను కర్తవ్యముతో విద్యార్థులు గుర్తించాలి మొదటిది మనస్సు ఈ మనస్సు కలవాడే మనిషి 'యద్భావం తద్భవతి' మనస్సు ఎట్టిదో మనిషి అట్టివాడు. దీనినే ఆంగ్లమునందు So think at the man, So is the

**ఆకారంచేత మానవులు కావచ్చునుగాని ఆచరణ మానవులు కనిపించటంలేదు. ఆచరణలో మానవులం కావాలి. దీనినే The proper study of mankind is man అన్నారు. Thoughts (ఆలోచనలు), Words (వాక్కులు), Actions (చేతలు) - ఈ మూడింటియొక్క ఏకత్వం జరగాలి. మేము కేవలం అల్పులమనిగాని, కేవలం మానవ శరీరధారులమనిగాని భావించకూడదు. సమస్త విశ్వమూ మీలోనే ఉంటున్నది. నీవు నిత్యుడవు, సత్యుడవు. ఇలాంటి విశ్వాసం మానవునిలో అభివృద్ధి కావాలి. మానవత్వం అద్భుతమైనటువంటిది, అనంతమైనటువంటిది, అర్థవంతమైనటువంటిది. మానవుడనగా కేవలం భౌతిక శరీరధారి మాత్రమే కాదు. శరీరము, మనస్సు, ఆత్మల యొక్క చేరికే మానవత్వం.**

\- బాబా

man అన్నారు కనుక మానవత్వము యొక్క విశిష్టత ఎంత విశాలమైనదనే సత్యాన్ని విద్యార్థులు గుర్తించాలి మానవుడు అన్నమయకోశము, ప్రాణమయకోశము, మనోమయకోశము, ఆనందమయకోశము, విజ్ఞానమయ కోశము — ఈ ఐదు కోశములచేతనే కప్పబడి వుంటున్నాడు. భౌతికమైన శరీరము ఆహారముచేత నిర్మించబడుతూ వచ్చింది. కనుకనే దీనికి స్థూల శరీరమని పేరు రెండవది ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశముల మూడింటి యొక్క ఏకత్వముచేతనే సూక్ష్మ శరీరమని ప్రకటించబడుతూ వచ్చింది ఇదియే మానవుని యొక్క సుఖదుఃఖములకు ఆధారము. మానవుడు అనుభవించేటటువంటి సర్వానుభవములు కూడనూ ఈ సూక్ష్మశరీరము ద్వారానే అనుభవిస్తున్నాడు దీని తరువాత ఆనందమయ కోశము ఇది ప్రపంచమునకే మూలాధారమైనది. ఏ విధముగా అన్నమయ కోశమునందు చైతన్యములో ప్రకాశించేటటువంటి ఆత్మతత్త్వమునకు, Bodyly Consciousness (బాడీ కాన్షస్‌నెస్) అన్నారు. అనగా శరీరమునందు కూడనూ ఆత్మ ప్రకాశిస్తూనే ఉంటున్నది దీనినే సర్వస్ కాన్షస్‌నెస్ కూడా అన్నారు ఇది కేవలం ఒక ప్రాణ తత్త్వమును మాత్రమే గుర్తించటం కాక ప్రాణాధార తత్త్వాన్ని కూడనూ ప్రకటిస్తూవస్తున్నది మూడవది మానసిక చైతన్యమునందు మెలిగేటటువంటి ఆత్మ దీనినే శారీరకమైనటువంటి చైతన్యతత్త్వమన్నారు ఇంక నాల్గవది విజ్ఞానమయకోశము. ఇది ప్రపంచమునకే మూలాధారమైనటువంటిది ఇది 'చిత్' తపస్సుతో కూడినటువంటిది దీనినే సర్వ చైతన్యాత్మకము అని కూడనూ పేరు పెట్టాయి దీనిని మరొక విధముగ విచారణ చేసినప్పుడు — ఇది సర్వత్రా వ్యాపించినటువంటి దివ్యశక్తిగా రూపొందుతూ వస్తుంది ఇలాంటి తత్త్వములను ఈనాడు మానవుడు గుర్తించటానికి తగిన ప్రయత్నములు చేయటం లేదు దీని తరువాతి The pure divine sel. (పవిత్ర పురుషార్థం) అన్నారు ఇందులో ఒక విధమైన పరిశ్వాధారమైన శక్తి కూడా ఇమిడిఉన్నది దీనినే All effective soul అన్నారు. ఈ తత్త్వమే లోకమును సంరక్షిస్తూవస్తున్నది దాని తరువాత ఆనందమయ కోశమును కూడా గుర్తించటానికి ప్రయత్నించేస్తూ వచ్చారు ఈ ఆనందమయమైనటువంటి దానిని ప్రతి మానవుడూ ఆశిస్తున్నాడు

ఈ ఆనందం మనకు ఏ రీతిగా ప్రాప్తిస్తుంది ? మొట్టమొదట "మానవుడు" అనే పదమునకు చక్కగా అర్థం తెలుసుకోవాలి. మానవుడు అనగా "ఆత్మ" అని అర్థం ఈ ఆత్మ నుండి ఆవిర్భవించినటువంటిదే ఆకాశాది పంచభూతములు ఈ పంచ భూతములను మానవుడు స్వాధీనంలో ఉంచుకున్నాడు కనుకనే మానవుడు Master కాగలిగాడు ఈనాటి మానవుడు మానవత్వము యొక్క అర్థమును గుర్తించుకోలేక పోవటం చేతనే ఈ ఐదు ఇంద్రియములకు దాసుడై పోతున్నాడు "మానవ" పదమునకు అర్థము తెలుసుకొనినవాడే మాధవత్వాన్ని తెలుసుకోవటానికి శక్తి కలవాడవుతాడు తనను తాను తెలుసుకొనినవాడే సర్వమునూ తెలుసుకొనినవాడవుతాడని వేదాంతం బోధిస్తున్నది నిన్ను నీవు తెలుసుకొనుటకు తగిన కృషి చేయాలి నీవనగా ఎవరు ? బహిర్ దృష్టిని దూరం చేసుకోవాలి కనులతో చూచినది, చెవులతో విన్నది, మనసుతో అనుభవించినది, చిత్తముతో ఆనందించినది—ఇవన్నీ కూడనూ కేవలం బాహ్యమైనటువంటి అనుభవములే వీటిని Elivation అన్నారు ఇవి లోపలనున్నటువంటి దివ్యమైనశక్తియొక్క ప్రతిబింబములే ఇలాంటివాటిని మనం సత్యమని గుర్తించి సత్యమైనటువంటి దివ్యత్వాన్ని విస్మరించి, మానవత్వమునే వ్యర్థం చేసుకుంటున్నాడు మానవుడు కనుక మానవత్వమును మనసుద్వారా ఈ దివ్యత్వాన్ని గుర్తించటానికి ప్రయత్నించాలి.

"మనసే హేతువు మనుజుడి మనుగడకును దుఃఖము సకువు, మాన్యతకున్, మనసే ముక్తికి మూలము,
మనసే నరకంబు తెచ్చు మైమరపించు "

ఈ మనస్సు తత్త్వమే మానవత్వముగా మారి, మానవత్వమే దివ్యత్వాన్ని మరిపించి – ఈ జగత్తును సత్యముగా విశ్వసింపచేస్తున్నది

ఈ "జగత్" అనే పదములోనే అర్థము కూడా ఇమిడి ఉంటున్నది ఇది సత్యము కాదు 'జ' ... "గత్" ... వచ్చిపోయేటటువంటిది రాకపోకలతో కూడినటువంటిది ఈ "జగత్" రాకపోకలు లేనటువంటివాడు మానవుడు ధరించిన దేహము మార్పు చెందవచ్చును, క్షీణించవచ్చును కాని మానవుడు మార్పు చెందేవాడు కాదు, నశించేటటువంటివాడు కాదు కనుకనే అతనికి "నరః" అన్నారు. "రః" అనగా నాశనము "న" అనగా లేనటువంటివాడు "నరః" అనగా నాశనము లేనటువంటివాడే నరుడు అట్టి నాశనము లేనటువంటి తత్త్వమే ఆత్మతత్త్వము కనుకనే మానవుడు అనగా ఆత్మస్వరూపుడే గాని, కేవలం భౌతిక శరీరధారి కాదు ఇది మనస్సు యొక్క ప్రభావంచేతనే, అనేక విధములైన మార్పులు చెందుతూ వస్తున్నాయి

ఈ మనస్సు కూడనూ నాల్గు విధములైన స్థితిలో ఉంటున్నది 1 Super mind 2. Higher mind 3 Iliminated mind 4 Over mind ఈ నాలుగింటి రహస్యమును మానవుడు గుర్తించినప్పుడే " మానవుడనగా ఎవరు ? " అనే దానిని అర్థం చేసుకోగలుగుతాడు 1 Super mind ఇది అంతర్‌దృష్టితో మనం విచారణ చేయటానికి ప్రయత్నం చేయాలి అనగా తనయొక్క దృష్టిని బహిర్‌ముఖములో విస్మరించి, అంతర్‌ముఖముతో విశ్వసించి, అందులో విచారణ జరపటానికి కృషి చేయాలి మనం చేయవలసిన కృషి అంతా లోపల కాని, బయట కాదు అది inner divine అనగా దేహమా నీవు ? కాదు దేహము ఒక జడమైనటువంటిది మనసా నీవు ? కాదు ఇది ఒక ప్రతిబింబముతో కూడినటువంటిది వీటన్నింటి యొక్క Reflection, Reaction, Resound లే చిత్తము, బుద్ధి, అహంకారములు. కనుక బహిర్ సత్యము లన్నియూ మార్పు చెందేటటువంటివే. ఇలాంటి మార్పు చెందనటువంటిది ఒకటున్నది. ఆ యొక్క అంతర్భావముతో కూడినటువంటి దివ్యత్వమే దీనికి ప్రధానమని మొట్టమొదట ఊహించాలి ఇలాంటి రెండవ తత్త్వం లోపల cosomie divine (కాస్మిక్ డివైన్) అనగా నాయందు ఉండినటువంటి దివ్యతత్త్వమే, చైతన్యమే నా ఎదుటి వ్యక్తియందుకూడా ఉంటున్నదని మా ఇరువురి యందుండిన దివ్యశక్తియే విశ్వమంతా ఉంటున్నది సర్వత్రా ఉండినటువంటి దివ్యశక్తిఒక్కటే దీనికంటే మరొకటి లేదు దేహములు బల్బులవలె భిన్నభిన్నములుగా ఉండవచ్చును కాని అన్నింటి యందును ఉండినటువంటి చైతన్యశక్తి ఒక్కటే అదియే విద్యుచ్ఛక్తి ఈ తత్త్వాన్ని గుర్తించడానికి ప్రయత్నించడమే "కాస్మిక్ డివైన్" అంటారు దాని తరువాత కేవలం నీవు మాత్రమే నీ స్వరూపాన్ని గుర్తించినంతమాత్రమున చాలదు నీ ముక్తిని నీవు మాత్రమే కోరుకోవటం సాధ్యం కాదు భిన్న స్వరూపంతో వున్నటువంటి విశ్వస్వరూపాన్ని కూడా నీవు ఏకంగా భావించాలి కనుకనే ఈ ఏకత్వాన్ని మనం విశ్వసించినప్పుడే, మానవత్వం మనకు చక్కగా అర్థమవుతుంది కాని ఈనాటి మానవుని యొక్క పరిణామము పదార్థములు ప్రాణము, దేహము వరకే ప్రయాణం చేస్తున్నాయి దీని తరువాత ఈ ప్రయాణం స్తంభించిపోతున్నాది మనస్సు వరకు మాత్రమే మానవుడు ప్రయాణం చేస్తున్నాడు కాని ఆ మనస్సుకు అతీతమైన శక్తి (over mind) నికూడా మనం పొందాలి ఈ మనస్సు ఎంతవరకు ప్రయాణం చేయగలదు? "మనోమూలం ఇదం జగత్" జగత్ వరకు ప్రయాణం చేయగలదు ఈ జగత్తులో వుండే వస్తువులను గుర్తించటానికి మనస్సు ఆధారం కావాలి. మనస్సుతో వర్తించేంతవరకూ మానవుడుగానే ఉంటాడు కాని ఇది అమనస్కుడనగా ఏమి ? మనస్సుకు అతీతమైనటువంటి స్థితికి పోవాలి Super

mind లో ప్రవేశించాలి Super mind సూక్ష్మదేహమునకు సంబంధించినటువంటిది ఈ సూక్ష్మదేహమునందు మాత్రమే శరీరము, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము - ఇవి ఏవి యూ లేక, కేవలం చేతనాశక్తుడై వుంటాడు, దీనికి అతీతమైన కారణదేహంలో ప్రవేశించాలి ఈ కారణదేహమనే దానియందే శరీరము, మనస్సు, ఇంద్రియములు, బుద్ధిని అదుపు చేసే శక్తి (controling power) ఉంటుండాలి ఏతా వాతా సర్వశక్తులూ మానవునియందే ఇమిడి ఉంటున్నాయి మానవుడు అనంతమైన శక్తి కలవాడు, అద్భుతమైన శక్తి కలవాడు, అర్థవంతమైన శక్తి కలవాడు మానవునకు అర్థంకాని విషయాలు ఈ జగత్తులో లేవు కనుకనే అద్భుతమైన, అనంతమైన అర్థవంతమైన వాడు మా న వు డు కాని ఈనాటి మానవుడు గొప్ప విద్యావంతుడై, మేధావుడై, వైజ్ఞానవంతుడై, సర్వశక్తిమయుడుగా రాణిస్తూవుంటున్నాడు కాని ఇవి కావు వానియొక్క ఆత్మతత్త్వాన్ని ప్రకటించేటటువంటివి ఇవి ప్రాకృతిమైన శక్తులను ప్రకటిస్తవి కాని అంతఃశక్తులను ప్రకటించేటటువంటి తత్త్వము అగాధమై, అగమ్యమై, అనంతమై, అవ్యక్తమై ఉంటుండాలి అదియే మానవుని యందున్నటువంటి "కాస్మిక్ పవర్" అంటారు అదియే Universal power సర్వత్రా వుండినటువంటి శక్తియే తనయందు తనయందుండినటువంటి శక్తియే సర్వత్రా ఉంటుండాలి కాని ఆకారమును పురస్కరించుకొని, ఇది ఒక అణువుగాను, విశాలతను పురస్కరించుకొని, ఇది అనంతంగాను మనం భావిస్తున్నాం.

సర్వత్రా వ్యాపించినటువంటి గాలిని ఒక బెలూన్‌లో పట్టి, దాని మూతి కట్టినప్పుడు, ఈ అనంతమైన గాలి బెలూన్‌లో పరిమితమై ఉంటుండాలి కాని అనంతమైన గాలిలో ఇది కలిసిపోవటంలేదు ఎప్పుడు ఇది అనంతమైన గాలిలో కలిసిపోతుంది? బెలూన్‌ను బాగా ఊదినప్పుడు ఈ ఆకారమనే బెలూన్ బద్దలైపోతుంది ఇందలో అణుమాత్రంగా ఉన్నటువంటి గాలి అనంతంలో ఏకమైపోతుంది మన దేహములే బెలూన్ల వంటివి ఇందులో నింపుకున్నటువంటియొక్క అనంతశక్తిగా ఉండినటువంటి గాలిని అణువుగా మనం భావిస్తున్నాం. "అణోరణీయాన్ మహతో మహీయాన్" ఈ రెంటియొక్క ఏకత్వం ఒక్కటే కాని మనస్సు చేసే చింతన, దేహి చేసే పని, ఆత్మ చేసే సాక్షీభూతం -ఈ మూడూ భిన్నభిన్నంగా కనిపిస్తాయి కాదు ..కాదు... ఇది ఒకదానికొకటి ఏకమై ఉంటుంటాయి ఆకారములో భిన్నమేకాని, ఆనందంలో ఏకమే దీనినే ఉపనిషత్తులు అనంతంలోని ఏకత్వమే అనేకత్వంలోని ఏకత్వమేనని చెబుతూవచ్చాయి కనుక మానవత్వమనగా దైవత్వానికి భిన్నమయినటువంటిది కాదు మానవత్వమూ, దివ్యత్వమూ రెండూ ఒక్కటే కనుకనే రెండవస్థాయిలోపల ఈవిశాలమయిన భావాన్ని అభివృద్ధిపరచుకున్నప్పుడు దేవుడైన నేను, దేవుడైన విశ్వము రెండు కూడనూ ఒక్కటే అనేటటువంటి సమత్వానికి వస్తాం ఇదే Divine Universal Farm అన్నారు ఇది ఎట్లా వస్తుంది? వస్తువుల యొక్క భిన్నత్వంలో కాదు, వ్యక్తులయొక్క ఏకత్వంతోనె కనుక శక్తి తత్త్వాన్ని మనం Quality గా తీసుకోవాలి దేహమును కేవలం మనం Quantity గా భావించాలి Quantity కావల్సినంత ఉండవచ్చు Quality నే మనం ప్రధానంగా తీసుకోవాలి అదియే ప్రతి మానవుని యందుండిన చైతన్యం సర్వత్రా వ్యాపించినటువంటిది మనం గాలిని తీసుకుంటున్నాం ఈ గాలి ఒకరికే ప్రత్యేకంగా రావటం లేదు సర్వత్రా ఉండినటువంటి గాలిని ఎవరి శక్తికొలదీ వారు తీసుకుంటున్నారు. ఈ దేహమును ఒక పరిమిత (Limit) మయినదిగా భావిస్తున్నాం కనుకనే మానవత్వమును ఒక అణుమాత్రంగా భావించి, అల్పంగా భావించి, కేవలం తానొక దీనుడిగా విశ్వసిస్తున్నాడు

( తరువాయి 41 వ పేజీలో )

# మహాకవి కబీరు

డా॥ చలసాని సుబ్బారావు

భారతీయుల ఆర్ష విజ్ఞానంలో కాలం తెచ్చిన వైకృత్యాలను గమనిస్తూ మౌలికమైన వారి ఆలోచనా ధోరణి యందలి భవ్యతను, దివ్యతను లోకానికి చాటి చెప్పిన ఘనుడు కబీరుదాసు ఈయన ఒక మహా కవి హిందీ భాష మాట్లాడు ప్రజలలో, హిందీ చదువుకున్న వారిలో, ఆధ్యాత్మ భావాలు, అభిరుచి గల చదువరులలో మహాకవి కబీరును గురించి తెలియని వారుండరు పెద్దల సాహచర్యంలో, గురువుల శుశ్రూష ద్వారా తాను సాధించిన బ్రహ్మజ్ఞానాన్ని, హేతు విజ్ఞానాన్ని తన కవితలో పలికించిన మహాకవి కబీరుదాసు అనాదిగా భారతీయ ఋషులు సమకూర్చిపెట్టిన వేద విజ్ఞానంలోని నిజాలను స్వానుభూతితో సంలగ్న పరచి సమకాలీన ప్రజల భాషలో – ఆరు శతాబ్దముల పూర్వపు హిందీ భాషభాషలో వీటిని ప్రబోధించి వెళ్లిన మహానుభావుడీయన. ఈయన మానవులకు సహజ సిద్ధమైన సకల భోగాలకు, మోహాలకు, లోభాలకు తల వంచక నిజాన్ని నిర్భయంగా నివేదించగలిగిన సదాశయుడు, స్వచ్ఛంద జీవి, పరోపకార పరాయణుడు ఆశయాలకు ఆచరణకు మధ్య వైరుధ్యం రానీయక సమ్యక్ బుద్ధి కలిగి జీవించిన యోగి పుంగవుడు ఈయన వాక్కు వికారాలకతీతంగా ఈ దేశంలో సార్ధక్యం గల ఆధ్యాత్మికతకు ప్రాతినిధ్యం వహిస్తుంది తాను ముస్లింమతావలంబుల యింట పెరిగి పెద్దవాడైనా, హిందువుల సనాతన ధర్మంలోని విశ్వజనీనమైన మానవతా విలువలనే ఆదరించి ఆచరించి ప్రచారం చేశాడు వేల సంవత్సరాల పూర్వపు ఉపనిషత్కాలీన భారతీయ ఋషులకు, ఆధ్యాత్మ విషయ సంపద రీత్యా, గౌతమబుద్ధునికి తరువాత యుగాలలో ప్రజాదరణ గల ప్రతిభావంతుడైన వారసుడు గానే జీవించి వెళ్ళాడనుకోవడంలో అత్యుక్తి లేదంటాను

ఆది పదిరెండవ శతాబ్దం హిందువుల పరిపాలనా వ్యవస్థలకు కాలం చెల్లుతున్న రోజులు ఆనాటి రోజులలో జాతీయ భావన, దేశభక్తి లోపించ కారణంగా, వారిలో ఒకరి ఔన్నత్యాన్ని మరొకరు చూడలేని అసూయ, అసహనం, మూర్ఖత్వం మాత్సర్యం మితిమీరిన కారణంగా హిందూ రాజ్యోరతకు తీరని పరాభవం జరిగింది పరాభవమే కాదు, దానికి తిరోగమనం ప్రారంభమైంది పృథ్వీరాజ్ చౌహాన్ పొందిన పరాభవంతో కూడిన పరాజయంతో ఇచ్చట పాలనా వ్యవస్థ ముస్లిం మతీయుల చేతుల్లోకి పోయింది భారతీయ సనాతన ధర్మానికి చెందిన సదాశయాలతో కూడిన హిందువుల జీవన వ్యవస్థకు శాశ్వతంగానే గ్రహణం పట్టినట్లయింది ఈ దేశంపై నూతనంగా పాలనాధికారం చేజిక్కించుకొన్న ఇస్లామీ సుల్తాన్ రాజులు ఉదార మనస్తత్వం లోపించిన కారణంగా, హిందువుల ధార్మిక సాంస్కృతిక విషయాలలో జోక్యం కలుగజేసికొనడం జరిగింది. తమ మత వ్యాప్తి కొరకు, తద్వారా ఈ గడ్డపై తమ ప్రాబల్యాన్ని సుస్థిరం చేసికొనేందుకు పరిపరి విధాలుగా అకృత్యాలకు పాల్పడ్డారు వారు పాలితులుగా హిందూ ప్రజల జీవితం నిస్సహాయతకు నిక్షిప్త–విక్షోభాలకు గురయింది. అది ఈ దేశ చరిత్రలో ఒక పెద్ద మరపురాని మార్పు, దుస్సంఘటన. అయితే ఆ మార్పు యీ గడ్డపై మరొక వినూత్న సాహిత్యానికి శ్రీకారం చుట్టింది అదే భక్తి సాహిత్యం.

## జన్మ వృత్తాంతం

17 - 18 శతాబ్దాలకు పూర్వపునాటి భారతీయ చరిత్రలో కాలానికి సంబంధించిన స్పష్టత లోపించినట్లు కనబడుతుంది దీనికి కారణం బహుశ ఆంగ్లేయుల రాకతో ఈ గడ్డపై ఏర్పడిన విలక్షణ భావవిప్లవమేమో ననిపిస్తుంది పరిశోధనాప్రియులైన ఆంగ్లేయుల, వారి మార్గాన పయనిస్తున్న యితర చరిత్రకారుల ఆలోచనలు, ఆదర్శాలు, ఆధారాలు ఆ రంగంలో అప్పటి వరకు చెలామణిలో నున్న ప్రమాణంతో ఏకీభవించక వైశవ్యాన్ని సృష్టించినాయి నిజానికి అసలు దోషమెక్కడుందో తెలియదుగాని, ప్రతి మహనీయుని జీవితానికి వర్తించు అంకెల విషయంలో – అతడు పురాణకాలీనుడైనా చరిత్రకాలీనుడైనా ఏకాభిప్రాయం లేకుండాపోయింది. ఈ విషయంతో వివిధమైన ఆధారాలతో వివిధములైన నిర్ణయాలు వెలుగు నందుకొన్నాయి చరిత్ర నధ్యయనం చేసేవారిలో యిది నిజంగా తికమక సృష్టిస్తుంది మహాకవి కబీరు కూడ యీ తికమకకతీతుడు కాదు అయినా పాఠకుల సౌకర్యార్థంపై వైరుధ్యాల ప్రసక్తి లేకుండా సాధ్యమైనంతవరకు నిజానికతి చేరువలో, సంభవం కాగలిగిన చరిత్రాంశాలనే మనం సంస్మరించుకొనడం భావ్యమనిపిస్తుంది

కబీరు 15వ శతాబ్దం నాటి ఢిల్లీ సుల్తానులైన బహలోర్ - సికందర్ లోడీలకు సమకాలికుడు ఈయన 1398 క్రీ శ జ్యేష్ఠ పౌర్ణమి రోజున జన్మించాడు. ఈయన జన్మస్థలం కాశీ ఈయనకు జన్మనిచ్చిన తలిదండ్రులెవరో మనకు నిర్దిష్టంగా తెలియదుగాని పెంచినవారుమాత్రం నీరూ - నీమా అను పేర్లు గల ముస్లిం మతస్థులైన సాలికులజులు వస్త్రాలు నేయడం వారి వృత్తి. కబీరుకు బాల్యం నుండి లోకోపకార బుద్ధి, ఆధ్యాత్మ మనస్తత్వం, నిరాసక్తయోగం పూర్తిగా అలవడినాయి. ధన సంపాదనకు, భోగ విలాసాలకు, తదితర వ్యామోహాలకు మనసివ్వక జీవన పరమార్థం గురించి మాత్రమే అహర్నిశలు యోచిస్తూండేవాడీయన ప్రజ్ఞా వైదుష్యాలకు, నీతి నియమాలకు, భారతీయ వైరాగ్య సంపదకు ఈయన గర్వించదగిన వారసుడు

## నిరక్షరాస్యుడు

తలిదండ్రులవద్ద మగ్గంపై బట్ట నేయడం మినహా మరే విద్యను కబీరు నేర్వలేదంటారు స్కూలు చదువుల (Formal Education) రీత్యా అక్షరాస్యత రీత్యా దాదాపు కబీరు నిరక్షరాస్యుడే, అయితే వస్తు ప్రయోజనం, పరమార్థాలరీత్యా మాత్రం ఈయనొక మహా పండితుడు యోగాన్ని తన జీవన పరమావధిగా రూపొందించుకొని, గృహస్థాశ్రమంలో ఉంటూ, సర్వసంగ పరిత్యాగిగా, త్యాగధనుడుగా జీవించిన మహనీయుడు కబీరుదాసు జ్ఞానం, భక్తి, ముక్తి, ఈశ్వరుడు, జీవుడు, ఇహలోకం, పరలోకం, పాపం, పుణ్యం, పునర్జన్మ, ఆత్మ, పరమాత్మ, నిర్గుణ, నిరంజన, బ్రహ్మ, మాయ, హింస, అహింస, అవతార తత్త్వం ఏకేశ్వరవాదం సర్వేశ్వరవాదం, విగ్రహారాధన, కర్మకాండ మొదలగు అనేక తాత్విక విషయాలను ప్రజ్ఞాపూర్వకంగా పరిశీలించిన ఈ వ్యక్తి చదువరి (literate) కాదంటే మనకు నమ్మశక్యం కానట్లుంటుంది అయితే "కలం ముట్టలేదు, కాగితంతో పని లేదు మహనీయులు చెప్పినదేదో విన్నాను నా నోటితో దాన్నే తిరిగి పలికాను...అంతే" అని కబీరు స్వయంగా చెప్పుకొన్నమీదట మనకిక సందేహమెందుకు?...నిజమే... కబీరు తన చేతితో కలంపట్టి వ్రాయలేదు సాధు సాంగత్యం, తత్త్వ జిజ్ఞాస, ధర్మజ్ఞుల బోధనలు మొదలగువాటితో అర్షత్వాన్నలవరచుకొన్న యీ స్వతఃసిద్ధ బైరాగి అనుభవ మూలకమైన తన ఆలోచనలను నిష్కర్షగా, నిర్భీతితో ప్రబోధించి పండితులను సైతం పరమాశ్చర్యంలో ముంచి లేపనెత్తాడు...అది సాధు కబీరు వాణిమాత్రమే ఆ వాణి నీయన శిష్యులు అక్షరబద్ధం చేసిపెట్టారు

ఈనాడు హిందీ సాహిత్యానికీ, భారతీయ సంస్కృతికీ సంపత్తిగా మాన్యతనందుకొంటున్న ఈయన గ్రంథాలన్నీ యిలా వెలుగు నందుకొన్నవే

## రచనలు - ఆదర్శాలు

కబీరుదాసు అలా చెప్పిన దాన్ని, పాడిన దాన్ని ఆయన ప్రధాన శిష్యులు చిన్నా పెద్దా లిపి 75 గ్రంథాల రూపంలో వ్రాసి సంకలితం చేసిపెట్టారు ఆ గ్రంథాలన్నింటిలో మొత్తం కబీరు పాడిన పాటలు 24000 వరకు లభిస్తున్నాయి వాటిలో చాలావరకు సాఖీ, సబద్, రమైనీ అను మూడు ఛందోరీతులలో మలచబడినట్లు గమనిస్తున్నాం. వీటన్నిటిలో కబీరు జీవన్ముక్తి కొరకు నిష్ఠ-నియమాలతో కూడిన ఒక సమగ్ర జీవనోద్యమాన్ని నిర్వహించాడు. ఆ ప్రకారం భాషలు, కులాలు, మతాలు, వర్గాలు మొదలగు వాటినాధారంగా సమాజంలో పెరుగుతూవస్తున్న వైషమ్యాలను, అనర్థాలను ఖండిస్తూ సమానతా దృక్పథం ప్రతిపాదించబడింది దేశీయులలో పరస్పరావగాహన, ఉదారదృష్టి లోపించి నట్లయితే జాతి మనుగడకు ముప్పు తప్పదని హెచ్చరిక చేయబడింది భక్తిని ప్రబోధిస్తూ ఈయన అది రూఢిగతమయిన ఆచారాలతో బంధింపబడరాదనియు, ఆత్మ వికాసానికది దోహదం కలుగజేసేదిగా వుండాలనియు చెప్పాడు. ఈ ప్రచార క్రమంలో కబీరు బహుదేవోపాసన, విగ్రహారాధన, వ్రతాలు, పూజలు, శకునాలు లగ్నాలు, తీర్థయాత్రలు, యజ్ఞయాగాదులు, కొలుపులు, భూతబలులు, చేతబడులు, వర్ణాశ్రమాలు, కులగోత్రాలు దేవాలయాలు, మసీదులు, మొదలగు సంప్రదాయ ధోరణులనెన్నింటినో పదే పదే ఖండించాడు, పరిహసించాడు, నిరసించాడు

## సహజీవనం కావాలి

కబీరు అకలంక ధర్మజ్ఞుడు, పరిశుద్ధ సంఘ సంస్కరణాభిలాషి ఆర్ష ధర్మానికీయన మహోపకారం చేశాడు వాల్మీకి, వ్యాసుడు, గౌతమ బుద్ధుడు వంటి మహనీయులు ఆయా యుగాలలో అతి మార్గాలకు తిరిగిన ఆర్ష ధర్మాన్ని పునః పరిశోధించి ప్రక్షాళితం చేయ యత్నించినట్లు కబీరు కూడ 15వ శతాబ్దం నాటికి హిందూధర్మం పేరుమీద భారత జాతి జీవితంలో కొనసాగుతున్న ఛాందసాలను, వికృతధోరణులను కట్టేందుకు నడుం బిగించినట్లుంది ఈ యత్నంలో కబీరు ఆనాటి దేశ జీవితంలో శాంతికి భంగకరమైన హిందూ ముస్లిముల వైమనస్యం వైపు దృష్టిని మరల్చాడు తాను హిందువుల మధ్య ముస్లింగా పెరగడం వలన వైమనస్యపు విష ప్రభావాన్ని చవి చూశాడు కూడ దేశ శ్రేయస్సు కొరకు, మానవ శ్రేయస్సు కొరకు హిందూ ముస్లిం జాతుల మధ్య సఖ్యత (Harmony) అనివార్యమని ప్రథమంగా గుర్తించినవాడు కబీరు ఈయన తన జీవితంలో చాల భాగం, అంటే దాదాపు 80 సంవత్సరాల కాలాన్ని హిందూ ముస్లిముల సహజీవనాన్ని ప్రబోధించేందుకే వెచ్చించాడంటే ఆశ్చర్యపడవలసిన పనిలేదు, కబీరులోని యీ మహత్తరమైన కర్తవ్యనిరతిని గురించి విశ్వకవి రవీంద్రుడన్న మాటలివి -

" The need was of a great larmony, a re-conciliation and of a co-ordination the principles of Islam and those of Hinduism. This need was supplied by Kabir who was thos a pruduct of his times, Thus among Indian rel gicns reformers Kabir holds a very important place He preached the unity of God and the essential oneness of all religions He was a messiah of Hindu - Muslim unity

## అద్వైత బ్రహ్మవాది

కబీరు నిర్గుణ భక్తుడు నిష్కళంక ధర్మసాధకుడు విగ్రహారాధన, తిలక్ ధారణ, గంగా స్నానం, జప తపాలు, పూజా వ్రతాలు, మొదలగు సగుణోపసనా పద్ధతులను మినహాయించి పరిశుద్ధమైన బ్రహ్మానుభూతిని మాత్రమే ప్రబోధించాడాయన జ్ఞాన మూలకమైన

నిర్గుణ భక్తితోపాటు మానవునిలో కర్తవ్య జ్ఞానాన్ని, సేవాదృష్టిని, ఋజువర్తనాన్ని ముఖ్యాంశాలుగా ప్రబోధించాడు ఈయన సంఘజీవితంలో మూఢ విశ్వాసాలకు పిచ్చి నమ్మకాలకు వ్యతిరేకంగా వివేకాన్ని, విచక్షణా జ్ఞానాన్ని ప్రచారం చేశాడు ఈయన ప్రబోధంలో సేవాభావం, సమతాభావం, లోపించిన పూజలను, చిత్తశుద్ధి లేని భక్తి ప్రపత్తులను, ఆత్మశుద్ధి లోపించిన ఆచారాలను, పూర్తిగా నిరసించాడు భగవంతునిపట్ల నిష్కల్మషమయిన ప్రేమ, ఆత్మానుభూతి మనలో కలగనంతవరకు పైపై పూజలకు, ఆరాధనలకు ప్రయోజనముండదని బల్లగుద్ది మరీ చెప్పాడు

సిద్ధాంతరీత్యా కబీరు అద్వైత బ్రహ్మవాది సర్వశక్తి సంపన్నుడు సర్వ వ్యాపకుడు అయిన భగవంతుడు యీ జగత్తంతా నిరాకార స్థితిలో వ్యాపించి వున్నాడనే ఉపనిషత్ బ్రహ్మవాదాన్ని నమ్మి జీవించాడు ఈ నిర్గుణ బ్రహ్మమనేదాన్నే కబీరు దేశమంతా తిరిగి ప్రచారం చేశాడు ఇది ముస్లింల ఏకేశ్వరవాదానికి భిన్నమయినసర్వేశ్వరవాదం. ఈయన అభిప్రాయానుసారం ఈశ్వరుడు సగుణుడు - నిర్గుణుడు, సాకారుడు, నిరాకారుడు అను భేదభావన కతీతమయిన శక్తి, అదే పరబ్రహ్మ ఆ పరబ్రహ్మనే కబీరు 'రాముడు' గా భావించి కీర్తించాడు, ఒక్క రామనామమే కాదు, హరి, మురారి, సారంగపాణి, కర్తా, కర్తార్, సత్యనామ్, సమరథీ, నిరంజన్, నిరచ్చర్, సాహబ్, సాయి వంటి అనేక నామాలతో ఆ పరబ్రహ్మను కీర్తించినట్లుంది ఈ రామనామ సంకీర్తనను ముక్తికి సులభమార్గంగా స్వీకరించాడాయన

## చివరి దశ

కబీరు తనదంటూ స్వతః ఒక ధార్మిక సంప్రదాయాన్ని గాని, సంస్థను గాని నెలకొల్పలేదు ఆ నాటికి హిందూ ముస్లిం సమాజాలలో పేరుకుపోయిన నిరర్థకమైన సాంఘిక సంప్రదాయాలను, మతపరమైన అంధ విశ్వాసాలను నిశితంగా నిరసిస్తూ ఉభయులలోను మానవోచితమైన ఉదార మనస్తత్వం రావాలనిమాత్రం ప్రబోధించాడు

అలా అడుగడుగునా ధర్మమార్గంపై కబీరు నిరసనకు చివాట్లకు గురైన హిందూ ముస్లింలు కొందరానాడీయనకు శత్రువుగా పరిణమించారు ముఖ్యంగా ముస్లిం మత పెద్దలీయనను ఇస్లాం మత పెద్దలీయనను ఇస్లాం మతద్రోహిగా లెక్కించి అప్పటి సుల్తాన్ సికిందర్‌లోడీకి ఫిర్యాదు చేయగా లోడీ లోకోపకరి, సంఘసేవాపరాయణుడైన యీ మహనీయుణ్ని మతాలను కించపరుస్తున్నాడను సాకుతో కాశీనుండి బహిష్కరించాడు ఈయన తన శిష్యులతో దాదాపు క్రీ శ 1490 లో కాశీ నుండి మగహర్ వెళ్ళిపోయాడు అచ్చటనే యీయన వృద్ధాప్యం గడిచింది అచ్చటనే క్రీ శ 1518 లో తన 120 సం ల పండు వయస్సులో పరమసిద్ధిని పొందాడు

కబీరు మరణించిన తరువాత ఆయన బోధనలను, ఆదర్శాలను గౌరవించేవారి ఉద్యమాలు, సంఘాలు, మఠాలు అంటూ అనేకం వెలిశాయి కబీరు శిష్యులు, ప్రశిష్యులు తమ తమ పేర్లతో సిద్ధాంత మార్గాలను నెలకొల్పి కబీరు రూపొందించిన జ్ఞానాశ్రిత నిర్గుణభక్తిని ప్రచారం చేశారన్నమాట ఈ నాటికీ ఉత్తర భారతమంతటిలో కబీరు మఠాలంటూ అనేక సాధు నిలయాలు నడుస్తున్నాయి. అవి నిర్గుణ భక్తులకు యాత్రాస్థలాలుగా రాణిస్తున్నాయి

ఈ మహనీయుని స్మృత్యర్థం యీయన పంచత్వ సిద్ధి పొందిన మగహర గ్రామంలో ఉత్తర ప్రదేశ్ ప్రభుత్వం 50 లక్షల వ్యయంతో స్మారక భవనం, దానితోపాటు ఒక అతిథి గృహం, ఒక పార్కు, ఒక చెరువు నిర్మించింది భవనంలో కబీరు మహాకవి జీవితానికి సంబంధించిన విశేషాలతో పాటు యీయన గ్రంథాలన్నీ ప్రదర్శింపబడుతుంటాయి యీయన ప్రవచించిన సిద్ధాంతాలను విశదపరచే చిత్రపటాలెన్నో అందులో ఏర్పాటై వుంటాయి యీ విధంగా కబీరు జ్ఞానిగా, భక్తుడుగా, యోగిగా, ధర్మజ్ఞుడుగా, తత్త్వజ్ఞుడుగా మహాకవిగా, ప్రవక్తగా, సంఘ సంస్కర్తగా యీ నాటికీ భారతీయ సంస్కృతికి నిండు స్ఫూర్తి నిస్తున్నాడు యీ ఆదర్శజీవి అన్నివిధాల ధన్యుడు ♦

# గీత - అమృతవర్షిణి

సాయి గంగామహాదేవ్

శ్లో॥ సుఖమాత్యన్తికం యత్తద్బుద్ధి
గ్రాహ్యమతీంద్రియమ్।
వేత్తి యత్ర నచైవాయం
స్థితశ్చలతి తత్త్వతః ॥

— రోగి ఔషధమును సేవిస్తాడు ఆ ఔషధం పనిచేసిందీ, లేనిదీ ఎట్లా తెలుస్తుంది? రోగ నాశనమే నిర్ధారణ అట్లే సాధకునకు తన సాధన ఫలించిందీ, లేనిదీ ఎట్లు తెలుస్తుంది? శాశ్వత సుఖానుభవము, దుఃఖరాహిత్యానుభవమే దానికి నిదర్శనము ఆ విషయమే ఇచ్చట ప్రస్తావింపబడుతున్నది

ఆత్మానుభవమును "సుఖం" అని భగవానుడు ప్రస్తావించాడు సుఖమనగా భోగములు కావు "సు" అనగా పవిత్రత, "ఖం" అనగా ఇంద్రియములు "సుఖం" అనగా పవిత్రమైన ఇంద్రియములు ఇంద్రియముల పవిత్రత అంటే ఏమిటి? పవిత్రమైన దివ్యత్వములో ఇంద్రియములు లీనమాతే ఇంద్రియ పవిత్రత ఏకత్వమే పవిత్రత అనేకత్వమే అపవిత్రత కనుక "సుఖం" అనగా ఈశ్వరునిలో ఇంద్రియములు లీనం కావటమే ఐతే ఈ సుఖం ఎటువంటిది? దీనికి మూడు లక్షణాలు చెప్పారు భగవాన్

1) బుద్ధిగ్రాహ్యం 2) అతీంద్రియం 3) ఆత్యంతికం 1) బుద్ధిగ్రాహ్యం-అనగా, బుద్ధిచేత తెలుసుకొనబడునది అని అర్థము కాదు ఆత్మవిషయము కాదు తెలియబడడానికి కనుక గ్రాహ్యమనగా పొందుట బుద్ధిగ్రాహ్యమనగా బుద్ధిచేత పొందబడునది ఎట్లనగా ఒకడు సముద్రమును పొందదలెననీ, సముద్రాభిముఖముగా ప్రయాణించే నదిని ఆశ్రయించి, తద్వారా సముద్రాన్ని చేరినట్లు, సాధకుడు బ్రహ్మాభిముఖమైన బుద్ధిని మొదట ఆశ్రయించి తరువాత బుద్ధి, తానుకూడా ఆత్మసముద్రములో లీనమౌతున్నారు. బుద్ధిగ్రాహ్యమనగా ఇది

2) అతీంద్రియం – అనగా, ఇంద్రియములకు వేరుగా, దూరంగా నున్నట్టిది అని కాదు "అతి" అనగా "దాటిన" అని ఒక అర్థము "అతీంద్రియం" అనగా ఇంద్రియస్థితిని దాటిన స్థితి అని ఒకటవ తరగతి దాటుట అనగా దాని వికాసస్థితి ఐన రెండవ తరగతి అని అర్థము అట్లే "అతీంద్రియం" అనగా ఇంద్రియస్థితియొక్క వికాసస్థితి అనగా ఈశ్వరస్థితి.

3) ఆత్యంతికం – అనగా. అంతము లేనటువంటిది దేనికి అంతము లేదో, దానికి ఆదికూడా వుండదు కారణం, అంతముకూడా ఆ వైపు నుండి చూస్తే ఆది ఔతుంది కనుక "ఆత్యంతికం" అనగా సర్వము తానైనటువంటిది అని అర్థము అనగా అద్వైతము; లేక ఏకత్వము ఇదే సుఖము.

ఇటువంటి సుఖమును యోగియైనవాడు ఎప్పుడు అనుభవాత్మకంగా మెరుంగునో ఎప్పుడితడు ఆత్మస్వరూపములో స్థిరమైనవాడై ఆ తత్త్వమునుండి చలించుటలేదో అప్పుడే యోగసిద్ధి – అని భగవానుని భవ్యవచనము కనుక ఈశ్వరాయత్తమైన బుద్ధిని చేబూని ఎల్లరు ఈశ్వరకృపకు పాత్రులై జీవత్వము నుండి శివత్వమునకు ప్రయాణించి ప్రమోదమందుదురు గాక! స్వస్తి!

# నారదభక్తి సూత్రాలు-32

# భక్తి దర్శనాచార్యులు

"శాంతిశ్రీ" జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి

**82 సూ. గుణ మాహాత్మ్యాసక్తి, రూపాసక్తి, పూజాసక్తి, స్మరణాసక్తి దాస్యాసక్తి సఖ్యాసక్తి వాత్సల్యాసక్తి కాంతాసక్తి, ఆత్మనివేదనాసక్తి, తన్మయాసక్తి, పరమవిరహాసక్తి రూపైకధా ప్యేకాదశధా భవతి**

ఒకటే అయిన భక్తిని నారదమహర్షి పదకొండు ఆసక్తులుగా పేర్కొన్నాడు

1 గుణమాహాత్మ్యసక్తి 2 రూపాసక్తి 3. పూజాసక్తి 4 స్మరణాసక్తి 5. దాస్యాసక్తి 6 సఖ్యాసక్తి 7 వాత్సల్యాసక్తి 8 కాంతాసక్తి 9 ఆత్మనివేదనాసక్తి 10 తన్మయతాసక్తి 11 పరమవిరహాసక్తి

పరిపూర్ణ భక్తులలో ఈ పదకొండు ఆసక్తులూ ఉంటాయి గోపికలు ఇందుకు ఉదాహరణలు వారిలో అన్ని ఆసక్తులు ఉన్నాయి ప్రతి భక్తునిలోనూ అన్ని ఆసక్తులు ఉండాలని లేదు వారి వారి అభిమతానుసారం రెండు మూడు కలిసి ఉండవచ్చు. లేదా ఏదైనా ఒక ఆసక్తిమాత్రం ఉండవచ్చు, ఇందులో ఎక్కువ తక్కువలు లేవు అన్నీ సమానములే ఏ ఒక్కదానితోనయినా భగవత్ ప్రేమ పొందవచ్చు

కొందరికి భగవంతుని కల్యాణ గుణ కీర్తనం చేయటంలో మక్కువ ఎక్కువ కొందరికి స్వామి దివ్య సుందర ముగ్ధమోహనరూప సందర్శనంలో ఆకాంక్ష అధికం కొందరికి స్వామిని సాకార రూపంలో చూచి పూజలుచేసి అర్చనలుచేసి పాదసేవ చేయటమంటే ప్రాణం కొందరికి స్వామిని తన కుమారుడుగా తలంచి స్నానపానాదులు చేయిస్తూ జోలపాటలు పాడుతూ ఎత్తుకొని ముద్దాడాలని మమత మరికొందరికి స్వామిని తన ప్రాణపతిగా ప్రియుడుగా శృంగారం చేసి తాను నాయికవలె గారాలు పోవాలని ఎడబాటు అయితే మధురాతి మధురమైన విరహవేదన పొందాలని తీయని కోరిక ఆత్మ సమర్పణ చేసి ఆత్మసాక్షాత్కారం పొందటం అందరి ఏకైక లక్ష్యం

గుణమాహాత్మ్యాసక్తి – ఇందులో రెండు విధానాలున్నాయి మొదటిది భగవంతుని గుణాలు వినుతించటం మహిమాసక్తి, దీనిని పాశ్చాత్యులు "సహజమతము" అంటారు వారికి మాధవ మానవ సంబంధం వింతగా తోస్తుంది

రెండవది భగవంతుని భువన మోహన రూప సౌందర్యం దర్శించి ప్రేమించటం ఇది ప్రేమాసక్తి. ఈ రెండూ ఉన్నత భక్తికి వికాస దశలు

పూజాసక్తి – అనగా ఆ దివ్య సుందరమూర్తిని పూజింపాలని అభిలషించటం దీనివలన భక్తుని భగవంతుని సంబంధం మరీ దగ్గర అవుతుంది దీనిని "PERSONAL LOVE" "అవయవప్రేమ" అంటారు పాశ్చాత్యులు

ఈ పూజాసక్తిలో నాల్గు రకాలున్నాయి 1. సేవకుడుగా పరిచర్య చేయటం. 2. మిత్రుడుగా స్నేహం చేయడం 3 తల్లిదండ్రులవలె లాలించి పాలించటం 4 ఆత్మ సమర్పణతో సారూప్య స్థితి పొందటం.

కాంతాసక్తి – ప్రియురాలువలె మధురంగా మృదువుగా హృదయంగమంగా ప్రేమించి సేవించటం ఈ ప్రేమ అధికమై సర్వసమర్పణచేసి సర్వేశ్వరుని సర్వత్ర దర్శించి ముక్తి పొందటం అన్ని ఆసక్తులు ఈ మూడింటిలో కలిసిఉన్నాయి

" కితాబ్-అల్ లూమా " అనే సూఫీ గ్రంధంలో కూడా భక్తిని కొన్ని రూపాలుగా విభజించారు 1. ధ్యానం 2 సామీప్యం 3 ప్రేమ 4. భీతి 5 ఆశ 6. కోరిక 7 ఏకాంత పరిచయం 8 శాంతం 9 నిరంతరమననం 10 దృఢత

ఈ భక్తివిధానాలలో **అగ్రగాములై అచ్యుతుని అంఘ్రి పద్మాలు అందుకొన్నవారిలో ముఖ్యులు** ఇలా ఉన్నారు

గుణమాహాత్మ్యసక్తి-నారదమహర్షి, వేదవ్యాసుడు, శుకమహర్షి, యాజ్ఞవల్క్యుడు కాకభుశుండి, ఆది శేషుడు, సూతపౌరాణికుడు, శౌనకుడు, శాండిల్యుడు, భీష్ముడు, అర్జునుడు, పృధువు, జనమేజయుడు, ఆధునికులలో తులసీదాసు, పోతన, త్యాగరాజు, రామదాసు మొదలైనవారు

రూపాసక్తి – మిథిలాపురి పౌరులు, గోపికలు, దండకంలోని మునిజనులు, రాధిక, ఆధునికులలో మీరాబాయి, తులసీదాసు, రామదాసు, త్యాగరాజు.

పూజాసక్తి – శ్రీలక్ష్మి దేవి, పృధుచక్రవర్తి అంబరీషుడు, భరతుడు, వ్యాసమహర్షి

స్మరణాసక్తి – ప్రహ్లాదుడు, నారదుడు, ధ్రువుడు, సనకాదులు, శబరి, చైతన్య ప్రభువు, పురందరదాసు, గాంధీమహాత్ముడు

దాస్యాసక్తి – హనుమంతుడు, లక్ష్మణస్వామి, అక్రూరుడు, విదురుడు, గరుడుడు, శేషుడు, శబరి, గుహుడు

సఖ్యాసక్తి – అర్జునుడు, ఉద్ధవుడు, సంజయుడు, సుదాముడు (కుచేలుడు) సూరదాసు

## విదురనీతి

" ఉత్పాద్య పుత్రాననృణాంశ్చ కృత్వా
వృత్తిం చ తేభ్యోఽను విధాయ కాంచిత్
స్థానే కుమారీః ప్రతిపాద్య సర్వా
అరణ్య సంస్థోఽథ మునిర్బుభూషేత్ "

తా॥ కుమారులను కని, వారికి ఋణబాధలు కలుగకుండ జేసి, ఏదో ఒక వృత్తిని వారికి, కల్పించి, కుమార్తెలందరిని, తగిన కుటుంబములలో ఇచ్చి వివాహము జరిపించి, ఆటు తరువాత వనమునందు మునిగా ఉండ దలచవలెను

వాత్సల్యాసక్తి-అతిది కశ్యపులు, సుతిపాప్రృశ్నులు, శతరూపామనువులు, కౌసల్యాదశరధులు, యశోదానందులు, దేవకీవసుదేవులు

ఆత్మనివేదనం – బలిచక్రవర్తి, అంబరీషుడు, ఆంజనేయుడు, విభీషణుడు, శిబి

తన్మయాసక్తి-యాజ్ఞవల్క్యుడు, శకుడు, సనకాది మునిగణం, కౌండిన్యుడు, సుతీక్ష్ణుడు

పరమవిరహావస్థాసక్తి – ఉద్ధవుడు. గోపికలు, అర్జునుడు, రామకృష్ణ పరమహంస.

♦ ♦ ♦

"హరి" యను రెండక్షరములు
హరియించును పాతకంబు అంబుజనాభా !
హరి ! నీ నామమహత్వము
హరి హరి! పొగడంగ వశమె హరి శ్రీకృష్ణా!

( సశేషం )

రసవద్ఘట్టాలు :

# ఓటమి నెరుగని ధీరులు

జానమద్ది హనుమచ్ఛాస్త్రి

నూటయాభై ఏళ్ళ క్రితం సంగతి ప్రస్తుతం ఉత్తర ప్రదేశ్‌గా వ్యవహరింపబడుతున్న ఆ రాష్ట్రం కరువు కాటకాల నిలయంగా వుండేది సదా జల పూర్ణములై ప్రవహిస్తున్న గంగ యమునా నదులున్న రాష్ట్రం కాని ప్రజలు అన్నార్తులైన గతికులు. అంగట్లో అష్టభాగ్యం, అల్లుని నోట్లో శనేశ్వరం

ఈస్టిండియా కంపెనీలో చిన్న ఉద్యోగం చేస్తున్న ఆంగ్లేయుడు కోర్ట్నీ ప్రజల బాధలు చూచి చలించాడు వారి వద్దకు వెళ్ళి " మీరు గంగానదీ జలాలను సేద్యానికెందుకు మళ్ళించుకోరు ? " అని ప్రశ్నించాడు గంగానది పేరు విన్నంతనే, ఆ బీదరైతులు "పాపం, మహాపాపం, ఆ నీటిని మేము పొలాలకు మళ్ళిస్తే గంగామాయి అపవిత్రురాలవుతుంది " అన్నారు

ప్రజల మూఢ నమ్మకం కోర్ట్నీ వాదనతో కరగని అభేద్యమైన బండరాయి. కోర్ట్నీ హిందూ సన్యాసుల కేంద్రమైన హరిద్వార క్షేత్రానికి వెళ్ళాడు అక్కడి మహంతుల అనుమతి సాధించాలనుకున్నాడు

మహంతుల కాళ్ళపై పడినాడు తెల్లవాడొకడు తమకు పాదాభివందనం చేయటం గమనించి పొంగిపోయారు మహంతులు "బేటా, నీ కోరిక ఫలిస్తుంది!" అని ఆశీర్వదించారు

వెంటనే లేచి ' లేదు, లేదు నా కోరిక ఫలించదు ' అన్నాడు

" ఎందుకు ఫలించదు ? " అని ఆశ్చర్యంతో అడిగారు మహంతులు.

" నేను గంగామాతను పొలాలకు మళ్ళించాలనుకున్నాను " అని సమాధానం చెప్పాడు.

" ఛీ, ఛీ, అది అసాధ్యం " అంటూ కోర్ట్నీ కోరికను తిరస్కరించారు.

" గురూజీ, ఇంతకు ముందే తాము నా కోరిక ఫలిస్తుందన్నారు కాని ఇప్పుడు తాము ఇచ్చిన మాట తప్పుతున్నారు.

ఆ మాట విన్న మహంతులు తబ్బిబ్బయ్యారు. ఏమి చెప్పాలో తెలియక తటపటాయిస్తున్నారు గత్యంతరం కానక " నీవు గంగామాతను తీసుకెళ్ళవచ్చు కాని .. " అంటూ అర్ధాంతరంగా మౌనం వహించారు

" తమ అభిప్రాయమేమో సెలవివ్వండి " అని వినయంగా కోరాడు

తమ ఆశీర్వాదం తప్పరాదు, గంగామాతను తీసుకు వెళ్ళరాదు అట్టి క్లిష్ట సమస్యను ప్రతిపాదించారు

" నీవు ముళ్ళ పావుకోళ్ళు ధరించి, హరిద్వారం నుండి, హృషీకేశ్ వరకు, మడిపంచ మాత్రం ధరించి నడుస్తూ వెళ్ళాలి ఈ దీక్ష పూర్తి కానిస్తే గంగామాయి నీ వశమవుతుంది " అన్నారు

ఆ తెల్లవాడు ఏమ ఆదేశాన్ని పాటించలేడని మహంతుల నమ్మకం కాని ఆ ఇంగ్లీష్‌వాడు సామాన్యుడు కాదు పట్టుదలగలవాడు. ముళ్ళ పావుకోళ్ళను ధరించి హరిద్వారం నుండి హృషీకేశ్ దాకా పాదయాత్ర పూర్తిచేశాడు కాళ్ళనుండి రక్తం స్రవిస్తూవుంది. అతని సాహసాన్ని మెచ్చుకోక తప్పదనుకున్నారు మహంతులు.

స్వాముల అనుమతి లభించినంతమాత్రాన గంగా

జలాలు పొలాలకు ప్రవహిస్తాయా ? ఆనకట్టలు కట్టాలి. కాలువలు తవ్వాలి ఆ పని సులభమా ? అందుకు పెద్ద మొత్తాలు కావాలి జనుల సహకారం కావాలి తన మార్గం సుగమం కాదని తెలుసు కాని "అసాధ్యం" అని చేతులు ముడుచుకోలేదు

ఆనకట్ట నిర్మాణావశ్యకతను పై అధికారులకు విన్నవించుకున్నాడు వారి మనసులను జయించాడు ఆనకట్ట నిర్మాణం, కాలువల త్రవ్వకం మున్నగు పనులలో శిక్షణకోసం శిక్షణాకేంద్రం స్థాపింపచేశాడు. కార్మికులను సృష్టించాడు అద్భుతాన్ని సాధించాడు కోట్లి శ్రమ ఫలితాన్ని ఈనాటి ఉత్తరప్రదేశ్ ప్రజలు అనుభవిస్తున్నారు

రూర్కీ విశ్వవిద్యాలయంలో అయన కాంస్య విగ్రహం వుంది ఒక వ్యక్తి దృఢమైన సంకల్పంతో ఏమి సాధించగలడో చూపటానికి సాక్ష్యంగా నిల్చున్నాడు కోట్లి. ఓటమినెరుగని వీరుడు.

# పేరు కోసం!

**కవుల ఆంజనేయశర్మ**

ఒకసారి భరతునికి తాను ఈ భూమండలాన్ని ఏకఛత్రాదిపత్యంగా పరిపాలిస్తూ చక్రవర్తి కావాలనే భావం కలిగింది మనస్సులోని ఆ భావం బయటపడి భరతుని చరిత్రలో ఒక మచ్చగా నిల్చింది. "అహం" అనేదానితో ఆయన ముఖం నిండింది శాశ్వతకీర్తి పొంది వచ్చేతరాలవారు తనని గౌరవించి పూజించాలనే కోరిక ఆయనలో బలపడింది కత్తిపిడిమీద పిడికిలి పట్టి ఎడమ చేతిని త్రిప్పుతూ తల పైకెత్తి చూశాడు ఆకాశానికి చేరినట్లు అగపడే వృషభాచల పర్వతం కన్పించింది భరతుని మనస్సులో తళుక్కుమని ఒక భావం మెరిసింది ఆ పర్వత శిఖరం మీద తన పేరు చెక్కిస్తే..., అది కూడా తాను చేసిన ఘన కార్యాల్లో ఒకటి కాగలదు. ఆ పర్వతం తన కీర్తిని ఎల్లప్పుడూ చాటుతూ వుంటుంది" – అనే ఆలోచన కలిగింది.

శ్రమను లెక్కచేయక శిఖరం చేరుకొన్నాడు భరతుడు ఉత్సాహం ఆవిరైపోయింది ఎండకు మండిపోతుండే ఇసుక నేలల్లో రెండు నీటి చుక్కలు పడ్డంత ఫలితం లభించింది శిఖరాన్ని మొదటినుండి చివరివరకు పరిశీలించాడు. అన్ని దిక్కులు చూశాడు లాభం లేకపోయింది. శిఖరమంతా పేర్లతోనే నిండి ఉన్నాయి తన పేరు వేయించటానికి అంగుళంమేర కూడా చోటు లేదు ఆ వ్రాయబడ్డ పేర్లన్నీ తరతరాల నుండి ఈ భూమండలాన్ని పరిపాలిస్తూ వచ్చిన రాజులవి భరతునికి చెమటలు పోశాయి. ముఖం చిన్నబోయింది మనస్సులోని అవమానం తగ్గలేదు. పరాభవం మరో మార్గం సూచించింది విధి లేక అక్కడ ఉన్నవాటిలో ఒకదానిని చెరిపి తన పేరు వేయించాడు

రాజధానికి తిరిగి వచ్చాడు భరతుడు, తిరస్కారింపు భావాలతో అతనికి సత్కారం లభించింది. రాజు పురోహితుడు " రాజా ! పేరును శాశ్వతపరిచే ఆధారాన్ని కూల్చేశారు. పేరును చెరిపి పేరు వ్రాసే ఒక క్రొత్త పద్ధతిని సృష్టించారు అక్కడ మీ పేరు ఎవరు, ఎప్పుడు చెరిపివేయగలరో ఎవరు చెప్పగలరు?"– అని శాంతంగా విన్నవించాడు

నిత్య జీవితంలో ఆధ్యాత్మిక దృష్టి-14

# గృహ వాతావరణం

పాతూరి ప్రసన్నం

" గృహమేకదా స్వర్గసీమ " అంటూ ఒకనాడు చిత్తూరి నాగయ్యగారు పాడుతూవుంటే, వినేవారు మైమరచిపోయేవారు " సంసారం ... సంసారం ... ప్రేమసుధాపూరం, నవజీవనసారం ... సంసారం " అనే ఘంటసాలవారి మధుర గానం వింటున్నప్పుడు కూడా, ప్రతి ఒక్కరి మనస్సు తన సంసారాన్ని గూర్చి, తన స్వగృహాన్ని గూర్చి, మధురమైన కలలు కంటుంది

ప్రతి మనిషికీ ఒక యిల్లు, ఒక వంశం, ఒక పరంపర వుంటాయి ఆ పరంపరలోని మనిషిగా, ఆ వంశంలోని వ్యక్తిగా, ఆ యింట్లోని సభ్యుడుగా ఆ వ్యక్తికి ఒక గుర్తింపువుంటుంది " ఫలానావారి తోటలోని మామిడికాయండి " అంటేనే ఆ మామిడి కాయను చూడకుండానే విలువకట్టేస్తాం కదా ! "ఫలానా జాతి బర్రె యిది " అంటేనే ఆ బర్రె యిచ్చే పాడి ఎంతటిదో గుర్తిస్తాం కదా ! మనిషికి అటువంటి గుర్తింపు వుండదా ? తప్పకుండా వుంటుంది, వుండాలి కానీ దురదృష్టవశాత్తు ఆ పరంపర, ఆ వంశం, ఆ యిల్లు, అనే వాటియొక్క విశిష్టతను మనకు మనమే కాల తన్నుకొనే శకంలో బ్రతుకుతున్నాం కాబట్టే మనిషిని కని, మనిషిని పెంచి, పోషించే గృహలక్ష్మి, గృహవాతావరణం గూర్చి కూడా కొంచెం తెలుసుకో వలసివస్తోంది

ఒక కసాయివాడి యింట్లో ఎదిగే చిలుక కూడా కసాయివాడి మాటలే పలుకుతుంది " కట్టు, కొట్టు, చంపు, నరుకు " అంటుంది ఆ యింటి చిలుక. ఒక సత్పురుషుడి యింట్లో పెరిగిన చిలుక " రండి, కూర్చోండి ఏం కావాలి ? అని పలకరిస్తుంది చిలుక జాతి ఒకటే ! కానీ అది పెరిగిన యింటి వాతావరణం యొక్క ప్రభావం దాన్ని తీర్చిదిద్దుతుంది అందుకే 'ఏ వాడ చిలుక ఆ వాడ పలుకు పలుకుతుంది' అంటారు.

గృహ వాతావరణాన్ని గూర్చి తక్కువ అంచనా వేయకూడదు. మనిషియొక్క సంస్కారం, స్వభావం, ఆధ్యాత్మికమైన అతని ఉన్నతి అన్నీ కలిసి అతని గృహ వాతావరణంలో ప్రతిబింబిస్తాయి

ఈనాడు మనవాడు ఉద్యోగంలో చేరగానే అతడు చేసే మొదటి పని ఏమిటి ? యింటినిండా ఫర్నీచరు అమర్చడం, గోడలకు రకరకాల అలంకరణ వస్తువులు తగిలించటం, ద్వారాలకు ఆకర్షణీయమైన తెరలు అమర్చటం, పూలకుండీలు, " ఏక్వేరియంలు " (చేపలు తిరిగే నీళ్ళతొట్లు) ఒకటేమిటి ! ఏమిటేమిటో యింటి నిండా అమర్చుతాడు గృహవాతావరణం అంటే అంతేనా ? అంతటితో సరిపెట్టుకోవటం దురదృష్టకరం.

ఒకసారి ఈ రచయిత ఒక బంధువుల యింటికి వెళ్ళటం జరిగింది. ( మా తోడిఅల్లుడుగారు ఉద్యోగ రీత్యా వుంటున్నటువంటి అద్దె ఇంటికి ) వారు ఆ వూరు బదిలీ అయిన తర్వాత మొదటిసారి వారిని చూడటం కోసం వెళ్ళాను క్రొత్తగా నిర్మించిన భవనంలో ఒక ప్రక్క వాటాలో వీరు వుంటున్నారు చాలా ఖరీదైన నిర్మాణం. కాళ్ళు కడుక్కొని ముఖం తువ్వాలుతో

తుడుచుకుంటూనే " ఏమిటి ? యిల్లు చూడబోతే యింటి ష్టయిలుగావుంది కానీ, ఏదో పెద్ద వెలితి ఫీలవుతున్నాను " Something is wrong with this house అన్నాను. నేను వాస్తు శాస్త్రజ్ఞుణ్ని కాను కానీ నా Six'h sense కు ఏదో ఒక అసంతృప్తి కలిగింది ఆ యింటి వాతావరణంలో అడుగుపెడుతూవుండగానే

" ఈ యింటి యజమాని పేరుపొందిన డాక్టరు లక్షలు పెట్టి యిల్లు కట్టాడు గృహప్రవేశం చేసి కొద్ది రోజుల్లోనే ఏ జబ్బూ లేకుండా చనిపోయాడు " అన్నది మా మరదలు

ఆ యింట్లో **Some thing is wrong** ఏమిటో తెలిసిపోయింది

గృహ వాతావరణాన్ని కేవలం భౌతికంగానే చూడకూడదు గృహవాతావరణం భౌతికంగా, మానసికంగా ఆధ్యాత్మికంగా కూడా మన యొక్క సంస్కారాన్ని ప్రతిబింబిస్తూవుంటుంది మనల్ని ప్రభావపరుస్తుంది

## భౌతిక వాతావరణం

యింటిని చూచి యిల్లాలిని చూడమన్నారు అదొక సామెత కాదు. ఒక జీవన సత్యం కొంతమంది యిండ్లకు వెళ్తాం ఎంతసేపు కూర్చున్నా యింకా కాసేపు కూర్చోవాలని అనిపించుతుంది మరి కొందరి యిండ్లకు వెళ్తే ముళ్ళమీద కూర్చున్నట్లు వుంటుంది ఎప్పుడు లేచిపోవాలా అనిపించుతుంది దీనికి కారణం ఆ గృహంలో గల వాతావరణమే ఈ రోజున వాతావరణ కాలుష్యాన్ని అరికట్టకపోతే ఈ భూగోళం పైన మనం బ్రతకటం కూడా సందేహంలో పడుతోంది అందరూ భౌతికమైన వాతావరణ కాలుష్య నివారణకు నడుం కట్టి కృషి చేస్తున్నారు కనుక మన గృహ వాతావరణాన్ని కూడా ఈ కాలుష్యాన్నుంచి రక్షించాలి ఇది మొట్టమొదట చర్య మనం తప్పక ఈ విషయంలో శ్రద్ధ వహించాలి. రోడ్డుమీదకు పోతే కారులు, లారీలు, రైలు కూతలు, విమానం మోతలూ లౌడ్‌స్పీకర్ల పెనుఘోషలు మనల్ని ఎంత " శబ్ద



కాలుష్యం " లో ముంచుతాయో అనుభవిస్తూనే వున్నాం వీటికి తోడు యింటికి రాగానే పెద్దగా 24 గంటలూ మ్రోగుతూ వుండే Star T V శబ్దాలూ, సినిమా పాటల ఆడియో క్యాసెట్ శబ్దాలూ, పిల్లలు పెద్దలు చేసే రణగొణ ధ్వనులూ, అరుస్తూ మాట్లాడటాలూ, ఇవన్నీ మనశ్శాంతిని హరించేవిగా వుంటాయి

ఈ రీతిగా మన యింటి వాతావరణంలో కూడా ప్రశాంతి ప్రతిబింబించటం లేదు ఇది దురదృష్టకరం ఇంట్లో వినబడాల్సినవి ఇవి కాదు ఉదయం నిద్ర లేస్తూనే 'ఓం'కారం, యిష్టదైవానికి చెప్పే సుప్రభాతం, చక్కని శ్రావ్యమైన భక్తిసంగీతం వంటివి వినబడాలి వాటి ప్రభావంచేత మనస్సు ప్రశాంతంగా, ఎంతో శక్తివంతంగా పనిచేస్తుంది ఉదయం ప్రతి యింట్లోనూ యిష్టదైవాన్ని ఆరాధించుతూ వుండగా చిరుగంటల సవ్వడి వినబడాలి. ఈ దేవతార్చన, గంటల సవ్వడి చేత యింట్లోనుంచి రాక్షస శక్తులు బయటకు పారిపోయి దేవతాశక్తులు మన గృహంలోకి ప్రవేశిస్తాయట

రేడియో, టీ వీ. లను ఎంత తక్కువ వాడుకుంటే అంత మంచిది పగలనక, రాత్రి అనక మనతోపాటు చదువుకొనే పిల్లలు కూడా ఈ టీవీల ముందు కూర్చొని ఎంత నష్టపోతున్నారో యిప్పుడు తెలియదు రేపు వారి బుద్ధులు, నడతలు భ్రష్ట మార్గంలో పడిపోయి నప్పుడు, చేసేది లేక యేడవవలసివస్తుంది పెద్దలైన వారికి. ఒక నిర్ణీతకాలంలో చదువుసంధ్యలు చెడకుండా T V లు వాడుకొనే అలవాటు చేయాలి

పూర్వం ప్రతి యింట్లోనూ హోమాలు చేసేవారు హోమ ద్రవ్యాలను అగ్నిలో వ్రేల్చటం ద్వారా వచ్చే పొగవల్ల, సుగంధంవల్ల గృహ వాతావరణంలో గల కాలుష్యం తొలగిపోవటానికి పూర్వీకులు ఆచరించిన మార్గం అది. ఇటీవల భోపాల్‌లో జరిగిన “గ్యాస్” ప్రమాదంలో వేలాదిమంది చచ్చిపోయారు, అంగ వైకల్యం పొందారు కానీ ‘ గ్యాస్ ’ ప్రమాదానికి గురిఅయిన ప్రాంతంలోనే ఒక యిల్లు వుంది. అందులో గల గృహస్థుడు నిత్యమూ హోమం చేస్తాడు అతని యింట్లో Antipolution వాతావరణం ఏర్పడింది కనుక గ్యాస్ ప్రమాదానికి గురియై కూడా వారంతా క్షేమంగా వుండగలిగారు. ఈ వార్త రష్యాలో గల సైంటిస్టులచేత లోకానికి వెల్లడి ఆయింది

ఈనాడు ప్రపంచ వాతావరణ కాలుష్య నివారణకు భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారు ప్రతి రోజూ ప్రతి యింటా భగవన్నామ సంకీర్తన కావించమన్నారు. “యింటింటా సంకీర్తనం” ప్రపంచ వ్యాప్తంగా ఒక ఉద్యమరూపం ధరిస్తోంది దైవనామ సంకీర్తనం వినిపించని గృహం మనుజులు నివసించే గృహం కాదు, అది క్రూరమృగాలు నివసించే గుహ అన్నారు శ్రీ సత్యసాయి బాబా ఇది యెంతో యదార్థం ప్రతి రోజూ పట్టుమని పది నిముషాలు చాలు యింటిలోగల కుటుంబ సభ్యులందరూ కలసి నామసంకీర్తన (భజన) చేయటం నేర్చుకోవాలి కనీసం మంచి మంచి భజన క్యాసెట్లు ప్రతిరోజు మన యింటిలో వినగలగాలి

గృహ వాతావరణం రూపొందించటంలో, అశ్లీల మైన సినిమా స్టార్ల చిత్రాలంకరణం చేయటం కన్నా ఆకర్షణీయమైన భగవత్సంబంధమైన పటాలూ, మహాపురుషుల రూపచిత్రాలూ అలంకరించటం ఎంతో మంచిది

మహాపురుషుల చిత్రాలను శ్రద్ధాభక్తులతో చూడటం ద్వారా వారియొక్క దివ్యశక్తి ప్రభావం మన మనస్సులపై ప్రసరిస్తుంది ఇదొక ఆధ్యాత్మిక సత్యం అశ్లీల చిత్రాలు చూడటంద్వారా మనలోని పశుత్వం ప్రకోపించుతుంది మన యింట్లో, గదుల్లో ఆదర్శ ప్రాయమైన చిత్రాలంకరణతో ఒక విశిష్టమైన, దివ్య మైన శోభను పెంపొందించాలి పిల్లలకు ఈ ఆదర్శ చిత్రాల వెనుకగల గాథలు వినిపించి వారిని ఉత్తేజ పరచాలి

## మానసిక వాతావరణం

ఎలెగ్జిస్ క్యారెల్ చెప్పినట్లుగా విటమిన్లు, బలవర్ధక మైన ఆహారం మాత్రమే పరిపూర్ణమైన వికాసాన్ని పిల్లలలో కలిగించలేవు వారిని పెంచటంలో మానసిక మైన వాతావరణం యింట్లో నెలకొల్పబడాలి మానసిక వాతావరణం సృష్టించకపోతే ఏమవుతుంది ? పిల్లలు గానీ, పెద్దలుగానీ ఆ యింట్లో ఒక హద్దు పద్దు లేకుండా మాట్లాడుతారు, ప్రవర్తిస్తారు క్రమశిక్షణతో యింట్లోని వారంతా ప్రవర్తించటం నేర్చుకోవాలి. ఎవరి హద్దులలో వారు మెలగాలి ఒక ఉదాహరణ. పిల్లలముందు అమ్మా నాన్న “నువ్వు అంటే నువ్వు” అంటూ కీచులు ఆడుకున్నారనుకోండి ఆ పిల్లలుకూడా అదే భాషలో అమ్మతో నాన్నతో వ్యవహరిస్తారు పిల్లలపైన ఎవరి అదుపూ లేకుండాపోతుంది మనం పిల్లల్ని ఒక ‘న్యూసెన్సు’ క్రింద జమకట్టి వారిని ఒక కాన్వెంటు లోనో, హాస్టలులోనో ప్రవేశపరుస్తున్నాం వారి మనస్సులపై ఆయాల ప్రభావం, “ఆంటీ”ల ప్రభావం వుంటుంది గానీ అమ్మా నాన్నల ప్రభావం వుండటంలేదు.

మన యింట్లోగల మానసిక వాతావరణం టీ వి ల వల్ల, సినిమాలవల్ల, చవకబారు సాహిత్య పత్రికల వల్ల ఎంతగా చెడిపోతోందో మనం ఊహించటంలేదు చెక్సు, క్రైములకు ఎక్కువ ప్రాముఖ్యతనిస్తూ ఈ పత్రికలు ఈ సినిమాలూ మనిషిలోగల మానవత్వాన్ని మంట కలుపుతున్నాయి మానవుని సన్మార్గంలో ప్రవేశ పరచటంలో తగిన బాధ్యత వుంటే, తగిన అవకాశాలు వుండికూడా ఈ పనికిరాని బూతు సాహిత్యం, హింసా సాహిత్యంతోచే మన "మీడియా"లు కలుషితం అయి పోతున్నాయి. మానవత్వాన్ని పోషించే రచనలు, మనస్సును కలుషితం చేయకుండా సంతోషపరచే పాటలూ, ఎన్నెన్ని లేవు ? ఈనాడు మిమ్మల్ని రెండు దయ్యాలు పట్టుకు పీడిస్తున్నాయి ఒకటి నవలలు, రెండవది టీ వి., సినిమాలు అన్నారు భగవాన్ బాబా ఈ వ్యాసం వ్రాస్తున్న నెలరోజుల క్రితం అమెరికాలో ఒక సంఘటన జరిగింది అది కుటుంబంలోని మన మానసిక పతనానికి పరాకాష్ట ఒక 40 యేండ్ల తల్లి టీ వి. చూస్తోంది కొడుకు టీ. వి దగ్గరకుపోయి, ఆమెకు అడ్డం వస్తున్నాడు వాడికి ఆ టీ వీ లోనే యింకో 'ఛానల్' కావాలి కొడుకును తల్లి అడ్డం తొలగమన్నది వాడు వినిపించుకోలేదు అంతే ! వాణ్ని తుపాకీతో కాల్చివేసింది. మన నవనాగరికతలో గృహజీవన పరిస్థితి యిదే ! మానసిక పతనం యిది!

క్షీణించిన, కలుషితమైపోయిన మానసిక వాతావరణములో పుట్టేది మనుషులు కాదు, పశువులు, రాక్షసులే ! వారి బ్రతుకు పతనోన్ముఖం అయ్యేదే

## ఆధ్యాత్మిక వాతావరణం

ప్రతి యింట్లోనూ చక్కని ఆధ్యాత్మిక వాతావరణం నెలకొనాలి చిన్నతనంనుంచీ పిల్లలకు దైవంపట్ల భక్తివిశ్వాసాలు నేర్పాలి గృహవాతావరణం ఎంత పవిత్రమైనదిగా పోషింపబడితే అందులో పెరిగే వ్యక్తుల ప్రారబ్ధ కర్మలుకూడా అంత ఎక్కువగ రహిత మవుతాయి. మా మిత్రులు ప్రఖ్యాత జ్యోతిష్కులు చెప్పిన మాటలు యివి "ప్రతి మనిషీ పుట్టిన కాల, గ్రహసంపత్తిస్థిత, అతడు చేసుకున్న గత జన్మ లోని పుణ్య పాపములయొక్క కర్మఫలాన్ని యిప్పుడు నిర్ధారణ చేయవచ్చు ఒకడు ఎంతో దుష్కృతం చేసుకున్నాడు వాడు పుట్టినది మొదలుగా ఎంతో బాధా కరమైన దుష్ఫలితాలు అనుభవించాలి అని వాడి జాతక ములో వుంది కానీ అటువంటి వాణ్నికూడా వాడి గృహ వాతావరణం ఎంతో రక్షిస్తుంది ఒక పవిత్ర మైన గృహ వాతావరణం అతనియొక్క దుష్కర్మల కర్మఫలాన్ని ఎంతో రహితం చేస్తుంది వాడి బ్రతుకును సంస్కరిస్తుంది " అని వారు చెప్పారు.

ఒక సంఘటన వివరిస్తాను ఒక ఉద్యోగం చేసు కొనే యువకునికి వివాహం అయింది భార్య కాపురానికి వచ్చింది ఆమెకు కడుపు వచ్చింది మామగారు వచ్చి ఆమెను పుట్టింటికి తీసుకువెళ్ళాడు ఆడపిల్ల పుట్టింది కాలం గడుస్తోంది కానీ మామగారు భార్యను మరల అల్లుడితో కాపురం చేయటానికి పంపించలేదు

"నీ అమ్మను యింటి నుండి బయటకు పంపించు నీ భార్య నీతో కాపురం చేస్తుంది లేదా పుట్టింట్లోనే వుంటుంది ఆమె పోషణకు నీవు ప్రతినెలా డబ్బు పంపించాల్సి వుంటుంది " అనే ధోరణి లో మామగారు అతన్ని ఎంతో వేధించాడు బెదిరింపు జాబులు వ్రాశాడు అతనికి అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళు లేరు. తండ్రి కూడా కాలంచేశాడు తల్లి ఒక్కతే అతనికి పెద్ద దిక్కు ఆ తల్లి, కొడుకూ ఎంత బాధపడ్డారో దైవానికి ఎరుక

నన్ను వారింటికి పిలిపించారు మామగారి మీద క్రిమినల్‌గా ప్రొసీడ్ అవుతానని నా సలహా అడిగాడు అతని భార్యకు తనంటే యిష్టమే కానీ మామ రాక్షసుడు రానివ్వటం లేదు "కోడల్ని మానసికంగా గానీ, శారీరకంగా గానీ హింసిస్తున్నారా ?" అని ముసలామెను అడిగాను "స్వామి సాక్షిగా చెబుతున్నాను ఆమెను నా కుమార్తెలాగా చూసుకుంటున్నాను " అని చెప్పింది

ఆ సంసారంలో రగుల్కొన్న చిచ్చును చల్లార్చటానికి ఒక సూచన చేశాను "మీరు సాయి భక్తులుకదా! మీ మామగారి హృదయ పరివర్తన కోసం ప్రతివారం ఒక రోజు సంకీర్తన చేయండి నాలుగు నెలల్లో ఆయనే మీ ఆవిడ్ని, చంటిపాపను తీసుకువచ్చి మీ యింట దిగవిడచి వెళ్తారు" అని చెప్పాను మీ మామగారిని ద్వేషించకండి ప్రేమిస్తూ, దైవాన్ని ప్రార్థించండి" అని చెప్పాను కుటుంబంలో కలిగిన ఒక ప్రారబ్ధ కర్మ ఫలితానికి యిదొక పరిష్కారమా అనిపించవచ్చు కానీ వారి ప్రార్థనలు ఫలించినై మూడు నెలలు తిరగకుండానే తనంతట తానే వచ్చి కుమార్తెను, చంటి పాపను అల్లుడి యింట దింపి, వారికి నూతన వస్త్రాలు సమర్పించి, వియ్యపురాలి దగ్గర క్షమాపణలు చెప్పుకొని వెళ్ళాడు

మన యింట్లో గల ఆధ్యాత్మిక వాతావరణం యొక్క ప్రభావాలు యెన్నెన్నో

శివాభిషేకాలు, సత్యనారాయణస్వామి వ్రతాలు, హనుమాన్ చాలీసా, సుందరకాండ, సప్తశతి పారాయణలూ, యింట్లో పెద్దలు చేసే జప ధ్యానాలూ ఎంతో అద్భుతమైన గృహ వాతావరణం కల్గిస్తాయి! సందేహం లేదు

"ధర్మ్యాణి దేవి సకలాని, సదైవ కర్మాణ్యత్యాదృతా, ప్రతిదినం సుకృతీ కరోతి" అంటుంది 'దేవీ మహాత్మ్యం" ప్రతి రోజూ అత్యంత ఆదరణ భావంతో గౌరవభావంతోనూ గత జన్మలో సుకృతం చేసుకొన్న గృహస్థుడు, ఈ జన్మలో కూడా ధర్మ కర్మలు నిర్వహిస్తూ వుంటాడు, అని దేవీ మహాత్మ్యం అనే గ్రంథంలో మార్కండేయ మహర్షి వ్రాస్తారు గృహస్థ జీవితంలో ఆధ్యాత్మిక దృక్పథం ఒక సహజమైన జీవిత విధానం కావాలి

ఈ రోజుల్లో మన యింటిని ఒక చీట్ల పేకలు ఆడే క్లబ్‌గానో, కూరలు, సరుకులు అమ్మే ఒక దుకాణంగానో, పాఠాలు చెప్పే స్కూలుగానో, మనకు చేతనయినట్లుగా వాడుకుంటున్నాం. బ్రతుకుతెరువుకోసం మన యింట్లోనే ఏదో ఒక వ్యాపారం, కార్యక్రమం నడుపుకొనవచ్చు కానీ మనది ఒక పవిత్రమైన గృహ వాతావరణమనీ, యింటి వాతావరణంలోని పవిత్రతను కాపాడటంలో గృహిణీ, గృహస్థుడు కూడా పాటుపడవలెననీ గుర్తుంచుకోవాలి దురదృష్టవశాత్తు మన ఇండ్లలో రాజకీయాలు కూడా ప్రవేశించినై ఒక యింట్లో నలుగురు వ్యక్తులుంటే, ఆ నలుగురికీ నాలుగు పార్టీలు. ఒకరి ముఖం ఒకరు చూసుకోలేక, నాలుగు గోడలకూ, నాలుగు దిక్కులా నాలుగు గుమ్మాలు యేర్పరచి తిరుగుతున్నారు ఇంతకంటే ఏమి దౌర్భాగ్యం కావాలి?" అంటున్నారు భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు ప్రేమ ఏకత్వాన్ని బలపరుస్తుంది "రాజకీయం" ప్రేమను కూడా సంసారాల్లోనుంచి బహిష్కరిస్తుంది ఈ దుస్థితిలోనే మనమూ బ్రతుకుతున్నాం స్వార్థం నెరవేర్చుకోటానికే "రాజకీయం" ఒక అస్త్రమయింది రాజకీయాలు వుండవచ్చు రాజకీయ పదవులు యేలవచ్చు కానీ మన అందరి సమిష్టి శ్రేయస్సుకు రాజకీయం అడ్డు రాకూడదు మన గ్రామం యొక్క ప్రయోజనాలూ, మన స్వగృహం యొక్క పవిత్రమైన ప్రేమతో కూడిన వాతావరణం రాజకీయాలకు బలికాకూడదు, అంటారు భగవాన్ శ్రీ సత్యసాయి బాబా.

నీటి యొక్క కాలుష్యం చేత కొన్ని కొన్ని గ్రామాల్లో, ప్రదేశాలలోనూ పుట్టే పిల్లలకు అంగ వైకల్యం సంభవిస్తుంది ఆరోగ్యంతో పుట్టినా కూడా వారిని కలుషితమైన నీరు వివిధమైన శారీరక పీడలకు, శాశ్వత వైకల్యానికీ గురి చేస్తుంది అదే రీతిగా గృహ వాతావరణం అనేది తల్లి ప్రేమతో, తండ్రి యొక్క ఆత్మ గౌరవంతో, సోదర సోదరీమణుల అన్యోన్యతతో, వృద్ధుల యొక్క తపోబలంతో, ఆశీర్వచన శక్తితోనూ ప్రతిస్పందించాలి. అప్పుడు ఆ యింట్లో పుట్టిన అదృష్టవంతులు నిజమైన మానవు

లుగా పూర్ణ మానవులుగా ఎదుగుతారు. లేకపోతే నైతిక ఆధ్యాత్మికమైన "Atrophy" వ్యాధికి బలి అయిపోతారు, అంటారు శ్రీ ఎలెగ్జిస్ క్యారెల్ (Atrophy) అంటే బాల్యంలోనే శరీరంలో ఏదో ఒక అవయవాన్ని ఎదగకుండా అణచివేసే ఘోరమైన జబ్బు

మనం బోధించే మానవతా విలువలు అనే వాటికి తొలి పాఠాలు మన స్వగృహ వాతావరణంలోనే పిల్లలకు అలవడుతాయి వాటి మూలకందం స్వగృహమే, గృహ వాతావరణమే అటువంటి గృహస్థుడు ఆచరించ వలసిన జీవిత విధానాన్ని మహా భారతం యిలా వివరిస్తుంది -

"విజదారైక పర్వతమున్, కరుణయున్,విక్రంబునున్ దాల్మియున్ సుజనా సంగము, దేవ పిత్ర తిధి సంతుర్ద్వార్జనల్, హవ్యధుగ్పుజనంబున్, సకలాశ్రమస్థులను శ్రమస్థులను శక్యప్రక్రియంబ్రోపు, బంకజ గర్భుండు గృహస్థ ధర్మములుగా గల్పించె సుర్వీశ్వరా !"

(శాంతి - 2 - 231)

తన భార్యను ప్రేమిస్తూ అన్యకాంతలయందు కామము లేకుండా ప్రవర్తించటం, తన బిడ్డల యందు కరుణ కలిగి వుండటం ( ఈనాటి త్రాగుబోతులకు, దుర్వ్యసన శీలురకు తమ బిడ్డలపై కరుణ వుంటే అలా ప్రవర్తించరు), ఓర్పు, సత్పురుషుల సహవాసం, దేవతలను, తల్లితండ్రులను, అతిథులను గౌరవించటం, పూజించటం, అగ్నికార్యం చేస్తూ అగ్ని దేవుణ్ణి అర్చించటం, ఇతర ఆశ్రమాలకు చెందినవారిని అనగా బ్రహ్మచారులను, వానప్రస్థులను, సన్యాసులను పోషించటం, అనే ధర్మాలను గృహస్థుని యొక్క ధర్మంగా బ్రహ్మదేవుడు నిర్ణయించాడు" అని శాంతి పర్వం బోధిస్తుంది

పైన వివరించిన గృహస్థ ధర్మాలన్నింటిలోనూ గల ఆంతర్యం యిది -

1) ప్రతి గృహస్థుడూ తన శక్తికి దైవశక్తిని కూడా జోడించి బ్రతకాలి

2) తన కుటుంబంలో తనను అంతటివాణ్ని చేసిన పెద్దల పట్ల ఎన్నడు అవిధేయతతో ప్రవర్తించక వారిని గౌరవించాలి, కడతేర్చాలి.

3) సమాజంలో తోటివారిని కూడా శక్తికొలదీ పోషించాలి

ఈ మూడు ఆశయాలకూ ఒక పవిత్రమైన సాధనా క్షేత్రమే యిల్లు

యింటి వాతావరణాన్ని పవిత్రపరుచుదాం, ప్రపంచ వాతావరణాన్ని కలుషాలనుంచి కాపాడటంలో యిదే మొదటి చర్య

---

## దీనబంధు !

భానుకోటితేజ బ్రహ్మాండభాండాల
నిండి వెల్గుచున్న నిర్మలాత్మ
పండియున్న సత్యపరమాత్మరూపుండ
దివ్యప్రభల వెల్గు దీనబంధు !

జడత బాపి జగతి జనుల బ్రోవగ వచ్చి
నిలచి వెల్గుచున్న నిర్మలాత్మ
సత్యజనులయెడల సద్భావముల నిల్పు
దివ్యప్రభల వెల్గు దీనబంధు !

సత్యసాయిబాబ సర్వజగములందు
నిండి వెల్గుచున్న దండితేజ
పుమ్మ గావరమ్ము మహిమస్వరూపుండ
దివ్యప్రభల వెల్గు దీనబంధు !

- గుడిశేవ నరసింహారావు

# కొమరగిరి

(గత సంచిక తరువాయి)

సెంట్రల్ జైలు, రాజమండ్రి
ది. 9-12-76

చిరంజీవులకు ఆశీస్సులు

మీరందరూ శ్రద్ధగా చదువుతున్నారని ఆశిస్తున్నాను లోగడ ఉత్తరములలో విద్య యొక్క ఔన్నత్యాన్ని గురించి, ఆవశ్యకతను గురించి, ప్రాముఖ్యతనుగురించి కొన్ని విషయాలను వ్రాసియున్నాను ఈ ఉత్తరము లోను మరియు రానున్న ఉత్తరములలోను అసలు విద్య అంటే ఏమిటి ? ఎటువంటి విద్యను అభ్యసించాలి ? విద్యాప్రమాణాలు ఏ విధంగా ఉండాలి ? ఎటువంటి విద్య మానవాభ్యున్నతికి తోడ్పడుతుంది? అసలు జ్ఞానం ఎటువంటి విద్యలవల్ల కలుగుతుంది ? ప్రస్తుత విద్యా విధానం వలన ఏమైనా ప్రయోజనం వున్నదా ? అనే విషయాల మీద కొన్ని అభిప్రాయములను వ్రాయ దలిచాను మంచిగా అవగాహన చేసుకొని, ఆచరణలో పెట్టి అభివృద్ధిలోనికి వస్తారని విశ్వసిస్తున్నాను

నేడు మన సమాజంలో చదువుకోవడం ఉద్యోగం కోసమేనని, ధనసంపాదనకేననే అభిప్రాయం చాలామందిలో వున్నది. ఇది నిజంగా దురదృష్టకరం ఈ అభిప్రాయం ముఖ్యంగా ఆంగ్లేయుల పరిపాలన కాలం నుండి మనకు సంక్రమించింది ఈ భావాన్ని పనిగట్టుకొని మన ప్రజలలోఆంగ్లేయులే కలుగజేసారు "మెకాలే" మన దేశంలో ఇంగ్లీషును ప్రవేశపెట్టింది కూడా "గుమాస్తాలు" గా తయారు చేయడానికే ఆంగ్లేయులు తమ విద్యా విధానం ద్వారా మన ప్రాచీన భారతీయ సంస్కృతిని విజ్ఞానమును, ఉజ్వల చరిత్రను తారుమారు చేశారు భారతీయులు అనాగరికులని, ఆటవికులని పాఠ్య పుస్తకములలో వ్రాసి మనచేతనే చదివించారు. భారతీయులు వట్టి చేతకాని దద్దమ్మలని ప్రచారం చేశారు. కొంతమంది స్వార్థపరులైన భారతీయులు తమ స్వలాభంకోసం, బ్రిటీషువారి అండన జేరి ఈ దుష్ప్రయత్నానికి చేయూతనిచ్చారు అవాస్తవికమైన చరిత్రను సృష్టించి పాఠ్య పుస్తకములలో యిరికించారు అమాయక పసిహృదయాలలో విష బీజాలను నాటారు నిర్మలమైన మనస్సులను కలుషితం చేశారు భరించరాని భావదాస్యం మనలో కల్గింది.

షువారు బోధించిందే వేదం, చెప్పిందే సత్యం వ్రాసిందే వాస్తవం అనే అభిప్రాయంమన విద్యావంతులలో నాటుకొనిపోయింది చాలామందివిద్యావంతులు సంపాదన వ్యామోహంలో పడి "సేవకావృత్తి" ని స్వీకరించారు బ్రిటీషువారికి భృత్యులయ్యారు ఏజంట్లుగా వ్యవహరించి, స్వాతంత్ర్య సమరంలో, నిస్వార్థబుద్ధితో పాల్గొని పోరాడుతున్న దేశభక్తులను అనేక యిబ్బందులకు గురిచేశారు ఈ భావదాస్యం మనవారిలో కలగడానికి కారణం బ్రిటీషువారు అనుసరించిన, ప్రవేశపెట్టిన విద్యావిధాన ఫలితమే ఇప్పటికీ మనలో నుండి ఈ దాస్య భావాలు పైదొలగకపోవటం మిక్కిలి దురదృష్టకరం ఇస్త్రీ బట్టలు నలగకుండా, చేతులకు మట్టికాకుండా హాయిగా ఫ్యానుక్రింద కూర్చొని, ఏ విధమైన ప్రయాస లేకుండా, సున్నితమైన, నాజూకైన ఉద్యోగాలను చేస్తూ ధనం సంపాదించి, సుఖవంతమైన, విలాసవంతమైన జీవితాలను గడపాలనే అభిప్రాయం యిప్పటికీ మన విద్యావంతులలో ( మనస్సులలో ) పాతుకొనిపోవడం కడుశోచనీయం విద్య యొక్క పరమార్థం మటుమాయమైంది విజ్ఞాన సముపార్జనకు విద్యనభ్యసించా

లనే అభిప్రాయం ఎక్కడా కనుపించడం లేదు ఈ పరిస్థితి మారాలి జీవితం యొక్క గమ్యం విజ్ఞానాన్ని సంపాదించడం అంతటితోనే సంతృప్తి చెందరాదు దానిని నిజ జీవితంలో అనుభవంలోనికి తెచ్చి సర్వమానవ కళ్యాణంకోసం వినియోగించాలి కాని స్వాతంత్ర్యం వచ్చి 29 సంవత్సరాలైనప్పటికి ఈ భావం మన విద్యావంతులలో జనించకపోవడానికి కారణం ఏమిటి? స్వాతంత్ర్యానంతరం కూడా 'మెకాలే' పెట్టిన విద్యా విధానాన్నే అనుసరించడం, అవసరమైన, సమగ్రమైన మార్పులను చేయకపోవడం, శాస్త్రీయ పద్ధతులలో విద్యాబోధ జరుగకపోవడం, సాంకేతిక పరిజ్ఞానాన్ని అవసరమైన స్థాయిలో పెంపొందించకపోవడం, జీవితంలో తన కాళ్ళమీద తను నిలబడే శక్తినిచ్చే నిజమైన విద్యను గరపకపోవడం, వివేక, విజ్ఞానములను కలుగజేసేటటువంటి ఆధ్యాత్మిక విద్యను నేర్పకపోవడం, శక్తిని, స్ఫూర్తిని, ధైర్యాన్ని, బలాన్ని యిచ్చేటటువంటి వాస్తవికమైన మన దేశ చరిత్రను యిప్పటికి తిరిగి సమగ్రంగా వ్రాసి పిల్లలకు బోధించకపోవడం. జాతీయ విద్యా విధానాన్ని ప్రవేశపెట్టకపోవడం, వృత్తి విద్యలకు అవసరమైన ప్రాధాన్యత పాఠశాలలో యివ్వకపోవడం, నైతికవిలువలను పెంపొందించడానికి అవసరమైన తరగతులను నిర్వహించకపోవడం, సామాన్యమానవునికి ఉపయోగపడే విధంగా విద్యావిధానమునకు సక్రమమైన రూపకల్పన చేయకపోవడంవల్లనే విద్యావంతులలో రావలసినంత మార్పు రాలేదు

మన దేశంలో యిప్పటికీ "విద్య" అనేది యాంత్రికంగా బోధించబడుతుంది అందులో ఏ మాత్రం చైతన్యంగాని, నైపుణ్యంగాని లేదు ఈ ప్రస్తుత విద్యావిధానం తెలివితేటలను పెంపొందించడానికిగాని, వివేక విజ్ఞానములను కలుగచేయడానికిగాని ఏ మాత్రం ఉపయోగపడదు ఉద్యోగం మీద ఆధారపడకుండా స్వశక్తితో జీవించడానికి అవసరమైన అనుభవపూర్వకమైన శాస్త్రీయ సాంకేతిక విజ్ఞానాన్ని ఏ మాత్రం యివ్వడంలేదు బాలబాలికలలో నైతిక విలువలను (Moral values) పెంపొందించడానికి, అవసరమైన, ఆదర్శవంతమైన విద్యావిధానం యిప్పటికీ రూపొందకపోవడం కడు శోచనీయం అందువల్లనే డిగ్రీలు పొందినవారుకూడా ఉద్యోగాల కోసమే అర్రులు చాస్తున్నారు స్వశక్తితో సంపాదించడానికి ఏమాత్రం ఉత్సుకతను చూపించడంలేదు ఒకవేళ ఎవరైనా స్వప్రేరణతో, ధైర్యంగా ముందుకు వస్తే అటువంటి వారికి తగిన ప్రోత్సాహం, సహాయం లభించడం లేదు అందువల్ల ప్రతి విద్యావంతుడు "ఎంప్లాయిమెంటు ఎక్స్చేంజి"లో తన పేరును నమోదు చేసుకొని, ప్రభుత్వ, ప్రయివేటు కార్యాలయముల చుట్టూ సంవత్సరాల తరబడి కాలికి బలపం కట్టుకొని తిరుగు

## తపన

సాయిగీతమైన కాదు
నీ చెంపలు ముద్దిడటానికి
సాయి గీతమైన కాదు
నీ చెవులు రాగాలతో స్పృశించటానికి
ప్రశాంతిగోడ ఇటుకైన కాదు
నీ చేతి స్పర్శతో ఆనందించటానికి
ప్రశాంతి ఇసుక రేణువైన కాదు
నీ పాదరేణువై పులకించటానికి
నీ కాలి అడుగునై నీ కనుల వెలుగునై
నీ చేతి మురళినై , నీ పెదవి రాగమై
నీ పదమునై , నీ కవితనై
నీ భావమునై, నీ పలుకునై పోవాలిరా
సాయికన్నా . .

– పి. రాజ్యలక్ష్మి రంగారావు

తున్నాడు కాని ప్రయోజనం శూన్యం, ఉద్యోగాలు లభ్యం కావడంలేదు నేడు మన విద్యావంతులలో నిరాశ, నిస్పృహ తాండవిస్తున్నది ఈ నిరుద్యోగ సమస్య ప్రభుత్వానికి కూడా తీరని తలనొప్పిగా తయారైంది ఇటువంటి దుస్థితి దాపురించడానికి మూల కారణం ముఖ్యంగా మనకున్న ప్రస్తుత లోపభూయిష్టమైన విద్యా వ్యవస్థ అనడంలో ఏమాత్రం అతిశయోక్తి లేదేమోననిపిస్తున్నది

ఈ విద్యా వ్యవస్థలోని లోపాలను ప్రభుత్వం యిప్పుడిప్పుడే గమనిస్తున్నట్లు కన్పడుతున్నది నవంబరు ఆఖరులో కేంద్ర విద్యాశాఖామంత్రి ప్రొఫెసర్ నూరుల్ హసన్ హైద్రాబాద్ "సామాజికమార్పుకు విద్య ఒక మార్గము" అనే అంశంపై అడ్మినిస్ట్రేటివ్ స్టాఫ్ కాలేజీలో ప్రసంగిస్తూ "దేశంలో కొంత మంది ఉన్నతవర్గాలవారికి మాత్రమే ఉపయోగపడుతున్న విద్యావిధానంలో మార్పులు తీసుకొనివచ్చి, ప్రస్తుత పరిస్థితుల కనుగుణంగా విద్యావ్యవస్థను రూపొందించాలి" అని అన్నారు మన ఉప రాష్ట్రపతి గౌ॥ శ్రీ బి డి జెట్టీ పూనాలో నవంబరు ఆఖరులో జరిగిన ఒక సెమినార్‌లో మాట్లాడుతూ "ప్రస్తుత విద్యా వ్యవస్థలో సంపూర్ణమైన మార్పు రావాలి" అని అన్నారు వారణాశివద్ద సేనాపురిలో (నవంబరు ఆఖరులోనే) అఖిలభారత బేసిక్ విద్యా మహాసభలో "సెకండరీ విద్య గాంధేయ పద్ధతులలో బోధించబడాలి అది ఉత్పాదక శక్తిని పెంపొందించేదిగాను, సమాజ అవసరాలకు ఉపయోగపడేదిగాను వుండాలి" అని తీర్మానం చేసారు దేశం నలుమూలలనుండి విద్యావేత్తలు ఈ సభలో పాల్గొన్నారు. ఉప రాష్ట్రపతి ఈ సభలను ప్రారంభోత్సవము చేశారు ఈమధ్య జాతీయ విద్యా పరిశోధన శిక్షణామండలి ఢిల్లీ కేంద్రపాలిత ప్రాంతంలో విద్యార్థులలో సర్వే జరపగా ఎక్కువమంది విద్యార్థులు, విద్యతోపాటు హయ్యర్ సెకండరీ స్థాయిలోనే వృత్తికి సంబంధించిన కోర్సులను నడపాలని అభిప్రాయపడినట్లు వెల్లడైంది. స్టాక్‌హోం విశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్‌గా పనిచేస్తున్న ప్రొఫెసర్ గున్నర్ మిర్డాల్ (నోబుల్ బహుమతికూడా పొందారు) 1972 జనవరిలో ఢిల్లీ వచ్చినప్పుడు హిందూస్తాన్ టైమ్స్ పత్రికా విలేఖరికి యిచ్చిన ఇంటర్వ్యూలో భారతదేశ విద్యావిధానం గురించి అడుగగా "భారతదేశపు విద్యలో అధిక భాగం అభివృద్ధికి వ్యతిరేకమైనది నీవు నీ చేతులు మట్టి చేసుకోవద్దు అనే మనస్తత్వాన్ని అది పెంచుతున్నది" అని అన్నారు.

కనుక మన విద్యావిధాన రూపురేఖలు మారాలి. విద్యాప్రమాణాలు అభివృద్ధి చెందాలి మౌలికమైన మార్పులు చేయాలి బోధనా పద్ధతి మారాలి మానవ జీవన వికాసానికి తోడ్పడే విధంగా విద్యావ్యవస్థను పునర్వ్యవస్థీకరించాలి మరొకరిమీద ఆధారపడకుండా తన కాళ్ళమీద తానే నిలబడేట్లుగా చేసేటటువంటి విద్యను గరపాలి. విద్య నభ్యసించే బాలబాలికల మనోభిప్రాయాలు, మనస్తత్వాలు, అభిరుచులు, ఆలోచనలు కూడా మారి తీరాలి మన దేశంలో సహజసిద్ధంగా లభించే ప్రకృతి సంపద, ఖనిజ సంపదలను మానవ కళ్యాణానికి, దేశఆర్థికపురోభివృద్ధికి ఉపకరించేందుకు అవసరమైన విజ్ఞానమును బోధించే విద్యను నేర్పాలి మానవునిలో అంతర్భూతమై ఉన్న అనంత శక్తిని వికసింపజేయడానికి అవసరమైన శాస్త్రీయపరిజ్ఞానాన్ని, అనుభవజ్ఞానాన్ని కలుగజేయడానికి ఉపయోగపడే విద్యను గరపాలి వృత్తి విద్యలను చేసుకోవడంలో కూడా గౌరవ మర్యాదలు కలవనే అభిప్రాయం ప్రతి వ్యక్తిలో కలగజేయాలి తరతరాల నుండి సాంప్రదాయకంగా అనుసరిస్తున్న పద్ధతులలోనే మంచిని మాత్రమే గ్రహించి, మిగతా మూఢమైన పద్ధతులకు తిలోదకాలిచ్చి, అధునాతనమైన, ఆచరణయోగ్యమైన, అభివృద్ధికుపక

రించేటటువంటి ఉత్పత్తిని పెంచేటటువంటి శాస్త్రీయ, సాంకేతిక పరిజ్ఞానాన్ని సామాన్య ప్రజలకు అంద జేయాలి అప్పుడె మానవుని బుద్ధి వికసిస్తుంది గుమాస్తాగిరి మనస్తత్వం అంతరిస్తుంది మానవుడు స్వశక్తిమీద సంపాదనకు పూనుకుంటాడు మానవశక్తి దేశపురోభివృద్ధికి ఉపయోగపడుతుంది నిరుద్యోగ పిశాచి కౌగలినుండి మన యువతీ, యువకులు బయట పడుతారు ప్రభుత్వానికి కూడా కొంత భారం తగ్గు తుంది దేశం సస్యశ్యామలమౌతుంది విదేశాలమీద ఆధారపడవలసిన అగత్యముండదు ప్రపంచంలో మన దేశం కూడా ఒక అగ్రరాజ్యంగా తయారవుతుంది స్వరాజ్యం సురాజ్యంగా రూపొందుతుంది గాంధీజీ కన్న కలలు సఫలీకృతమవుతాయి

కనుక మీ అందరిలో కూడా విద్యార్జన ఉద్యోగం కోసం కాదు విజ్ఞాన సముపార్జనకి అనే భావం కలగాలి విద్యావంతులై, పెద్దవారైన తరువాత స్వశక్తితో దేశపురోభివృద్ధికి శక్తివంచన లేకుండా కృషి చేయాలి వ్యవసాయ, పారిశ్రామిక, వైజ్ఞానిక రంగములలో అత్యున్నతమైన అభివృద్ధిని సాధించేందుకు మీ శక్తిని, యుక్తిని, సమర్థతను, విజ్ఞానమును పూర్తిగా వినియోగించాలి "ప్రతి చేతికి పని కల్పించాలి ప్రతి గృహం ఒక పరిశ్రమ కావాలి ప్రతి గ్రామానికి విద్యుచ్ఛక్తి అందాలి, ప్రతి పొలానికి నీరు వెళ్ళాలి" ఈ మహోన్నత ఆశయ సాధనకోసం అవిరామంగా కృషి చేయాలి, సాధించాలి దేశాన్ని సస్యశ్యామలం చేయాలి భావిభారత పౌరులైన మీ ధ్యేయం ఇదే...అందరికీ ఆశీస్సులు

ఇట్లు
" మీ నాన్న "

# ప్రశ్నలు- సమాధానాలు

1) త్రిశూల్ ఏ తరహా క్షిపణి ?
2) నాగ్ ఏ తరహా క్షిపణి ?
3) R A F means
4) హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి నియమించబడిన మొట్టమొదటి మహిళ ?
5) పులికాట్ సరస్సు ఏ జిల్లాలో ఉంది ?
6) మొత్తం జనాభాకో షెడ్యూల్ కులాలపై గల శాతం ?
7) ప్రస్తుతం మన రాష్ట్రంలో ఉన్న వ్యవసాయ అభివృద్ధి బ్యాంకులు ?
8) గ్రామాధికారుల వ్యవస్థపై జనార్ధనరెడ్డి నియమించిన కమిటీ ?
9) భారతదేశంలో మొదటిసారి జనాభా లెక్కలు జరిగిన సంవత్సరం ఏది ?
10) ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నిషేధించిన నక్సలైట్ తీవ్రవాద సంస్థ ఏది ?

సమాధానాలు

1) సర్ఫేటు ఎయిర్ మిస్సైల్ 2) ఏంటి టాంక్ మిస్సైల్ 3) రాపిడ్ యాక్షన్ ఫోర్స్ 4) శ్రీమతి లీలా సేఠ్ (హిమాచల్ ప్రదేశ్) 5) నెల్లూరు 6) సుమారు 16% 7) 218 8) అరోరా కమిటీ 9) 1872 10) పీపుల్స్‌వార్ గ్రూప్

# గౌరముఖ మహర్షి

-పురాణపండ 'శ్రీచిత్ర'

శమీకమహాముని శిష్యరత్నము గౌరముఖుడు గురు శుశ్రూష చేయుచూ వేదశాస్త్రములు అభ్యసించాడు. శమీకుని పుత్రుడగు శృంగి కారణాంతరమున పరీక్షిత్తుని శపించగా ఆ వార్త పరీక్షిత్తునకు తెలిపి రమ్మని గౌరముఖుని పంపాడు అంత గౌరముఖుడు ఆ వర్తమానమును పరీక్షిత్తునకు తెలిపివస్తాడు గురువు వద్ద సమస్త విద్యలు సంపాదించి తానొక ఆశ్రమము నిర్మించుకొని శిష్యులను చేరదీసి వారికి బోధచేయ సాగాడు ప్రశాంత వాతావరణంలో గురుశిష్యులతో వేదాధ్యయనము చేయుచూ కాలక్షేపం చేస్తున్నారు ఆలా ఉండగా దుర్జయుడను మహారాజు సైన్యసమేతంగా అడవికి వేటకై వచ్చి వేటాడి అలసిపోయి గౌరముఖుని ఆశ్రమానికి చేరి ఆ మునిని దర్శించి నమస్కరించి నిలచాడు ససైన్యుడై తన ఆశ్రమానికి వచ్చిన రాజునకు విందు చేయ సంకల్పించి తన నిర్ణయమును రాజుకు తెలిపాడు రాజు అంగీకరించాడు

అంత గౌరముఖుడు గంగకు వెళ్ళి అందు స్నానం చేసి హరిని స్తుతించాడు హరి ప్రత్యక్షమై గౌరముఖుని దీవించి ఒక రత్నమిచ్చి దీని ప్రభావంతో అన్నియు సమకూరునని పలికాడు అనంతరం హరి అదృశ్యుడయాడు గౌరముఖుడు ఆ రత్నమును తీసుకొని వచ్చుసరికి ఆశ్రమం గొప్ప పట్టణంగా మారింది అందు అందమైన భవనములున్నవి గౌరముఖుడు రాజును సైన్యంతో ఆ భవనములందు ఉండుడని సవినయంగా పలికాడు వారందరూ ఆయా భవనములలో సర్దుకున్నారు. రత్న మహిమతో రాజుకు ఘనంగా విందు చేశాడు రాజు ఆశ్చర్యపోయాడు. రత్నమును తనకిమ్మన్నాడు మంత్రిచేత అడిగించాడు సేనాపతి చేత అడిగించాడు ఋషి రత్నమును ఇవ్వనని పలికాడు గౌరముఖునపై దండెత్తండని సైన్యమును పంపాడు రత్న మహిమచే ఆ మహర్షి సైన్యాన్ని సృష్టించాడు. ఇరు సేనలకు యుద్ధం జరిగింది గౌరముఖుడు హరిని స్మరించాడు అంత శ్రీహరి తన చక్రమును పంపి దుర్జయుని సైన్యమును నిమిష కాలంలో సంహరింపచేశాడు అనంతరం విష్ణువు వచ్చి మునీంద్రా! నేటి నుండి ఈ ఆశ్రమము నైమిషమను పేరున ప్రసిద్ధికాగలదు నే నిచ్చట యజ్ఞపురుషుడనై నివసింతును, అని పలికి అదృశ్యుడయ్యాడు. గౌరముఖుడు సంతసించి మరల తపస్సునందు నిమగ్నమైనాడు

కాలం గడుస్తోంది ఒకనాడు గౌరముఖమహర్షి ప్రభాసమను సోమతీర్థరాజమునకు పోయి హరిని పూజించసాగాడు అచ్చటికి మార్కండేయమహర్షి రాగా గౌరముఖుడు ఎదురేగి నమస్కరించాడు తన సంశయాలు అడిగి తెలుసుకొన్నాడు మార్కండేయుడు సంశయ నివృత్తి చేసి మోక్షమార్గము తెలిపి వెళ్ళిపోయాడు.

గౌరముఖుడు మార్కండేయుడు చెప్పిన ప్రకారము హరిని భజించి త్రికరణశుద్ధిగా సేవించి శ్రీహరి ప్రత్యక్షంకాగా ఆయనలో ఐక్యమయ్యాడు పరమపదం పొందాడు ✦✦✦

# పద్య కవితోద్యమం ఏ దిశగా సాగాలి?

–డాక్టర్ జి.వి. సుబ్రహ్మణ్యం

పద్యానికి మరలా మంచిరోజులు వచ్చేలాగున్నాయి దాన్ని గురించి నేడు పదిమందీ మాట్లాడుకొంటున్నారు. రెండేళ్ళక్రితం విశాఖజిల్లాయలమంచిలిలో పద్య కవితా ప్రచారోద్యమం ప్రారంభమయింది అందుకుగాను రాష్ట్రస్థాయి జిల్లాస్థాయి సంఘాలు ఏర్పడ్డాయి పద్యకవిత్వ మహత్వాన్ని చాటిచెప్పే సభలూ సమావేశాలూ చర్చలూ గోష్ఠులూ జోరుగా సాగుతున్నాయి రాష్ట్రమంతటా పద్యకవిసమ్మేళనాలు ప్రత్యేకంగా దిగ్విజయంగా నిర్వహించబడుతున్నాయి పద్య నాటకాలూ, పద్య కవితలూ పద్యాలకు ప్రాధాన్యమున్న సాహిత్యరూపకాలూ, అష్టావధానాలూ, శతావధానాలూ, ఆశుకవితా ప్రదర్శనలు ప్రజలను విశేషంగా ఆకర్షిస్తున్నాయి. పద్యకవితకు ప్రత్యేక సన్మానాలూ పురస్కారాలూ అందించే సంస్థలు చెప్పుకోదగినన్ని ముందుకు వస్తున్నాయి పద్య భవిష్యత్తును గురించి భయపడే రోజులు పోయాయి పద్యం మరణిస్తుందని చెప్పిన జోస్యం నవ్వులపాలయింది కాగా, పద్యం ప్రభంజనంలా వీచే సూచనలు దేశంలో బాగా కనపడుతున్నాయి.

పద్య భవితవ్యం మీద పత్రికల్లో చర్చలు కూడా మొదలయ్యాయి మచ్చుకు ఒకటి రెండు – 'పడుగు రాదు కవిత పద్యపౌనీ మీద' అనే వ్యాసం నేను "ఉదయం"లో వ్రాశాను (16–12–1991) 'నిజమా?... మళ్ళీ పద్య కవితోద్యమమా?' అని కల్లూరివారు (శ్రీ కల్లూరి భాస్కర్) ఆంధ్రప్రభలో వ్రాశారు (సమాంతరమ్ 8–3–1993) 'పద్యం మరణించలేదు' అని చేరాతలు ప్రకటించాయి (21–3–1993) ఇలా మరెందరో పద్య ప్రచారంకోసం వ్రాసే వ్యాసాలకంటే పద్య రచనా భవిష్యత్తును గురించి చర్చించే వ్యాసాలే విలువైనవి

పద్య కవితోద్యమం సాగిస్తున్నవారు ముఖ్యంగా మూడు విషయాలు చెపుతున్నారు 1 పద్యానికి గొప్ప భవిష్యత్తు ఉంది దానికి చావు లేదు అది నేటికీ బ్రతికి ఉంది 2 అయితే, దానికి ఇదివరకున్నంత వ్యాప్తి లేదు దానిని వెంటనే కల్పించాలి అందుకు ఉద్యమించాలి 3 ప్రచారం రెండు లక్ష్యాలతో సాగాలి. ఒకటి – పద్య కవిత్వపు గొప్పతనాన్ని చాటిచెప్పాలి. రెండు – పద్య కవిత్వం వ్రాయటం, చదవటం, విని సంతోషించటం మొదలైనవాటికి సమాజంలో వ్యాప్తిని కలిగించాలి ముఖ్యంగా ప్రచారం యువతరాన్ని ఉత్తేజపరచాలి వారు పద్య కవిత వ్రాయాలి

పద్యాన్ని సమూలంగా తిరస్కరించే తెలుగువాడుండటం అరుదు అయితే, పద్యం కంటే విలక్షణమైన వాహికకోసం అన్వేషిస్తున్నప్పుడు దాన్ని కాదన్నవారూ, దుడ్డుకర్రలతో నడుం విరగకొడతామన్నవారూ కొంతమంది ఈ అరవైయేళ్ళలో కనపడవచ్చు కాని, ఇన్నాళ్ళుగా దుడ్డుకర్రలు విరగడమే చూచాం గాని, పద్యం నడుము విరగలేదు. "నడుం విరగడం" జాతీయంగా గ్రహించినా అది నిజం కాలేదు వెయ్యేళ్ళ పద్యానికి అప్పుడప్పుడూ నడుం పట్టి వుండవచ్చు, నడుం వొంగి వుండవచ్చు మళ్ళీ నడుమూ, తలా యెత్తుకొని పద్యం క్రొత్త పోయలు పోవటం దాని జీవిత చరిత్రలో నిత్య సత్యం! చరిత్ర వాస్తవం!

వ్యాప్తి తగ్గిన పద్యానికి ప్రచారం చేసిపెట్టాలని పద్య కవితోద్యమకారుల ప్రయత్నం. అందులోనూ పాత పద్యాలే వినిపించి శ్రోతలను ఆకట్టించటం కష్టం. క్రొత్త ప్రయోగాలు చేసి పద్యానికి క్రొత్త బ్రతుకు బాటలను చూపించటం అవసరం. పద్యానికి ఆదరణం ప్రజలలో గాని పలుకుబడిని పెంచుకొని మాత్రమే యేర్పడదు, పద్య ప్రాణచైతన్యాన్ని పెంచే వస్తు నవ్యతను, అభివ్యక్తి శక్తిని అభినవంగా సాధించి నప్పుడే కలుగుతుంది. అందువల్లనె నేను పద్యం బ్రతికిఉందని సంతోషించాలా? ఆధునిక భావాభివ్యక్తికి అనువుగా జీవించగలుగుతున్నదని సంబరపడాలా ? అన్నది చర్చనీయాంశమౌతున్నది.

ఈనాటి జీవితానికీ కాలానికీ పద్యం పనికిరాదనీ, ఆధునిక భావప్రకటనను పద్య చట్రంలో బంధించటం అసాధ్యమనీ, పద్యం మనకిప్పుడొక మధుర స్మృతి లాంటిదనీ, పద్యయుగాన్ని మళ్ళీ సృష్టించటం సాధ్యం కాదని, చరిత్ర వెనక్కు నడవదనీ కల్లూరివారి వాదం. "పద్యాన్ని ఆధునిక కవులు ఆధునిక భావాలకు కూడా సమర్థవంతమైన వాహకంగా వాడుకొన్నారు. క్రొత్త పరిస్థితుల కనుగుణంగా మారగలిగిన కవితారూపం సాహిత్యంలో నుంచి శాశ్వతంగా నిష్క్రమిస్తుందని జోస్యం చెప్పటం ఇప్పుడు అవసరమా ?" అని చేరా (ఆచార్య చేకూరి రామారావు) కల్లూరిని ప్రశ్నించారు. చేరాతలను కాదంటూనే కల్లూరివారు ఒక మంచి మాట న్నారు "ఏ కవితారూపానికైనా ఆదరణ, నిరాదరణ అనేవి మన ఇష్టాయిష్టాలపై ఆధారపడి ఉండవు. విస్తృతపారకుల్ని దృష్టిలో పెట్టుకొని చూడాలి. సాహిత్య పరిణామ చరిత్రను గమనించాలి" (పద్యంలో ఆధునిక భావ ప్రకటన సాధ్యమేనా ? (సమాంతరమ్ 29-3-1998)

తెలుగులో పద్యం, గేయం, వచన కవిత్వం కలిసి యిప్పుడు సహజీవనం సాగిస్తున్న వన్న వాస్తవాన్ని యిద్దరు విమర్శకులూ గమనించారు. అందులో అభి ప్రాయ భేదం ఉండటానికి వీల్లేదు కాబట్టి ఇద్దరూ అంగీకరించారు. అయితే, ఇక ముందు పద్యానికి భవిష్యత్తు లేదని ఒకరంటే, అంత తొందరపడి ఎందుకు అప్పుడే ప్రకటిస్తారు, వేచి చూడండి" అని మరొక రన్నారు. ఇద్దరూ సాహిత్యంలో పరిణామం సహజ మని విశ్వసించేవారే.

మాటవరసకు కల్లూరివారు మూడు రూపాయల అస్తిత్వాన్ని అంగీకరించినా వచన కవిత ఆధునిక రూపమనీ, పరితలూ, శ్రోతలూ ఎక్కువ సంఖ్యలో ఆ రూపాన్నే అభిమానిస్తున్నారనీ స్పష్టం చేశారు. చేరాగారికి గూడా దానికి అభ్యంతరం ఉంటుందని నేననుకోను. అయితే, సాహిత్య భవిష్యత్ పరిణామ గతిని ఇప్పుడే స్పష్టంగా అంచనా వేయలేమని, పరిస్థితి ఇంకా ద్రవస్థితిలో ఉందనీ, పద్యం భవిష్యత్తులో ప్రాచుర్యం పొందజాలదని, దాని శక్తిని గమనించిన వారు, చెప్పటం కష్టమనీ చేరా అంటున్నారు. అంత వరకు బాధ్యతగల విమర్శకునిలా చేరా మాట్లాడు తున్నారు.

మరొక వాస్తవాన్ని మనం కాదనలేము. వచన కవితను అదివైయేళ్ళుగా అభిమానిస్తున్న ఆంధ్ర సహృదయలోకం దానిలోని బలాబలాలను గుణదోషా లను బాగా అవగాహన చేసుకొని యిప్పుడు దానికి ప్రత్యామ్నాయ రూపంకోసం అంతరాంతరాలలో అన్వేషణ మొదలుపెట్టింది. అందుబాటులో ఉన్న పద్యాన్నీ గేయాన్నీ పునరుజ్జీవింపజేసుకోవటానికి వీలున్న మార్గాలను కనుగొంటున్నది. ఈ పునరుజ్జీవన పద్ధతిలో మొదటి దశగా పూర్వ పద్య శిల్పాలను పునః పరిశీలిస్తున్నది, పద్యాన్ని ప్రజలలో ప్రవహింపజేయ గలిగిన ప్రక్రియలను పునఃచైతన్యవంతం చేస్తున్నది. అయితే, దీని తరువాతి దశ యేమిటి ? అన్నది ఇంకా దేశంలో నిశ్చయంగా రూపొందని ఒక ద్రవస్థితిగా ఏర్పడి ఉంది. వచన కవిత్వం తరువాత పద్య కవిత్వా నికి ప్రాచుర్యం రావచ్చనే సూచనలు కొన్ని

ప్రాచాయంగా కనబడుతున్నాయి. అయితే, పద్యమనంగానే నన్నయ శ్రీనాథుల పద్యాలవంటివే తిరిగి పుడతాయని అనుకోవటం ఒక భ్రమ మన కాలానికీ జీవితానికీ, అభిరుచులకూ అనువైన పద్యమే అవతరించాలి పద్యాల విద్యను ఆధునికీకరించే ప్రతిభకోసం, ప్రయోగాల కోసం ఆంధ్రలోకం ఎదురు చూస్తున్నది అటువంటిది అసాధ్యమని కల్లూరివారి అభిప్రాయం పద్యానికి అటువంటి శక్తి ఉంది కాబట్టి సాహిత్య పరిణామదశలో దానికి మంచి భవిష్యత్తు ఉండటానికి వీలుంటుందని చేరా ఆశాభావం

ప్రజలు పద్యమంటే ఇప్పుడు మరీ ప్రాణమిస్తున్నారు అన్ని వర్గాలను కలిపి చూస్తే గేయం కంటే, వచనపద్యం కంటే పద్యానికే గౌరవ మర్యాదలు ఎక్కువగా కనపడుతున్నాయి. దానికితోడు - ఇప్పుడు భారతీయ భాషా సాహిత్యాలలో వస్తున్న పరిణామాలను గమనిస్తే, కొత్తరూపాలను దేశిమూలాల నుండి ఎన్నుకొనే ప్రవృత్తినే రచయితలూ, పరిశీలకులూ సమాదరిస్తున్నారు అందువలన భవిష్యత్తులో పద్యమే ఈనాటి కనువైన రూపంలో పునర్భవిస్తుందేమోనన్న అంచనాలో సత్యముందనిపిస్తుంది అలా పుట్టిన పద్యం ఆధునిక భావాభివ్యక్తికి అనువైన రూపాన్ని అలంకరించుకొంటుంది అటువంటి పద్యరూపం పుట్టటానికి వీలులేదన్న భావంతో కల్లూరివారు తమ భావాలు తెలిపారే కాని, పుడితే వారూ సంతోషిస్తారనుకొంటాను!

పద్య కవితా ప్రచారోద్యమం వారు పై రెండు అభిప్రాయాలనూ గమనించి తమ లక్ష్యాలను నిర్ణయించుకోవాలి. వారి ముందు ముఖ్యంగా రెండు మూడు ప్రశ్నలున్నాయి అవి -

1 పద్య ప్రచారం కోసం పద్య ప్రక్రియలతో ఉద్యమించటమా ? పద్యేతర ప్రక్రియలతో ఉపక్రమించటమా ,



2 ఏదైనా ఒక క్రొత్త ఉద్యమాన్ని ప్రారంభించి, దాని భావజాలాన్ని, ఎత్తుగడలన్ని పద్య రూపంలో ప్రచారం చేయటమా ?

3 అసలు ఏదైనా ఉద్యమంకోసమే పద్యంతో ఉద్యమించటమా ?

4 ఆధునిక పద్యమనే ఒక నవ్యరూపాన్ని ఆధునిక జీవిత సమస్యల అభివ్యక్తికి అనుగుణంగా కల్పించుకొని వచన కవితకు రూపాంతరాన్ని నిర్మించుకొనే ఉద్యమాన్ని సాగించటమా ?

5 పద్యరచనలో క్రొత్త క్రొత్త శైలులను, బాణీలను కల్పించటం ద్వారా నిత్య నూతనత్వాన్ని, ప్రజాభిరుచినే సృష్టించుకొంటూ ప్రచారాన్ని సాగించటమా ?

పద్య కవితోద్యమకారులు పద్యానికి గొప్ప భవిష్యత్తు ఉందని జోస్యం చెపుతున్నారు గాని దాని చిత్రాన్ని స్పష్టంగా రూపుకట్టించలేకపోతున్నారు పద్య ప్రచారానికి పద్యేతర ప్రక్రియల కంటే పద్య ప్రక్రియలే బాగా తోడ్పడతాయి ప్రచార సాధనాల మాధ్యమాన్ని ప్రయోజనదాయకంగా వాడుకుంటే ఎన్నో ఉపయోగాలు కలుగుతాయి పద్యప్రాచీన వైభవం ఉద్దీపనానికి మాత్రమే తోడ్పడుతుంది పద్యం నేడు నిర్వహించవలసిన పాత్రను గుర్తించి, దర్శించి దానికనుగుణంగా ప్రయోగించటం పద్యం జీవించటానికి దోహదం చేస్తుంది కాబట్టి ఆధునిక పద్య రచనం వైపు ఉద్యమం దృష్టిని సారించాలి ⁂

వెలుగు వ్యక్తిత్వాలు : 47

# త్యాగంలో ఆనందాన్ని పొందిన నిష్కామ కర్మయోగి

# రామానందతీర్థ

-కంచి వాసుదేవరావు

రాజకీయ అవినీతి గౌరవనీయమైన జీవన విధానంగా గుర్తింపు పొందుతున్న ఈ రోజులలో – రాజకీయాలు లాభసాటి వృత్తిగా – అధికార పదవులు – నాలుగు తరాలకు సరిపడ్డ ఆస్తులు సంపాదించుకునే సాధనాలుగా రాజకీయ నాయకులు పరిగణిస్తున్న ఈ రోజులలో – వెనుకటి తరంలో – కొందరు రాజకీయాలలో అత్యుత్తమ నైతిక విలువలను పాటిస్తూ – రాజకీయాలను నిస్వార్థ – ప్రతిఫలాపేక్ష రహిత ప్రజాసేవ సాధనాలుగా భావించే ఋషితుల్యులు వుండేవారని తెలిస్తే ఆశ్చర్యం కలుగుతుంది రెండు పూటలా తిండికి – కట్టుకున్న బట్టలుకాక మరొక జత బట్టలకే తమ జాతి అవసరాలను పరిమితం చేసుకుంటూ సామాన్య ప్రజలలో దైవాన్ని చూస్తూనే వారి సేవ మాధవసేవగా జీవిత పరమార్థంగా భావించేవారు వుండేవారంటే మరీ ఆశ్చర్యంగా వుంటుంది తమ స్వార్థప్రయోజనాలకు ప్రజలను పావులుగా వుపయోగించుకునే ఈ రోజులలో – ప్రజల సేవకే మనసా వాచా కర్మగా కృషి చేసిన మహామనుషులు వుండేవారు వారి సంఖ్య తక్కువ అయినా – వారి ప్రభావం అపారం అట్టి వారిలో స్వామీ రామానందతీర్థ ఒకరు

రామానందతీర్థ హైదరాబాద్‌లో స్థిరపడిన మహారాష్ట్రుడు ఆ రోజులలో హైదరాబాదు సంస్థానంలో తెలుగు, మరాఠీ, కన్నడ భాషలు మాట్లాడేవారు హైదరాబాదు ఈ మూడు భాషల త్రివేణీ సంగమంగా వుండేది రామతీర్థ అసలు పేరు వెంకట్రావు ఖేడ్గీకర్. దాదాపు 80 సంవత్సరాల క్రితం యింకా సరిగ్గా చెప్పాలంటే 1932 మకరసంక్రాంతి పర్వదినాన, ఒక నదిలో నడుము లోతు నీళ్ళలో నిలబడి – ప్రజాసేవ దీక్ష వహించాడు ఈ దీక్ష ఆయనకు యిప్పించినది నారాయణస్వామి అనే గురువు. దాన్ని విద్యుత్ సన్యాసంగా ఆయన పేర్కొన్నారు అనాటినుంచి – వెంకట్రావు ఖేడ్గీకర్, రామానందతీర్థ అయ్యారు యావత్తు ప్రపంచం ఆయన కుటుంబమయింది ఆ కుటుంబ సేవకే ఆయన తన జీవితాన్ని అంకితం చేశారు ఆయనకు తనదంటూ కుటుంబంలేదు తనకు అంటూ సంపాదించుకోవలసిన ఆస్తులులేవు డబ్బుతో అవసరంలేదు సర్వసంగ పరిత్యాగం చేశారు

నిజాం పాలననుంచి హైదరాబాద్ సంస్థాన విముక్తి అవిశ్రాంత పోరాటం జరిపిన ప్రథమశ్రేణి యోధులలో స్వామీ రామానందతీర్థ ఒకరు. హైదరాబాద్‌కు రాష్ట్ర కాంగ్రెస్ వ్యవస్థాపకులలో ఒకరు ఆయన రాజకీయ జీవితం దాదాపు గాంధీజీ రాజకీయ ప్రవేశ కాలం నుంచే ప్రారంభమయింది మహాత్మాగాంధీ పిలుపు నందుకుని మెట్రిక్ చదువుతున్న వెంకట్రావ్ ఖేడ్గీకర్ – చదువుకు స్వస్తి చెప్పి భారత జాతీయోద్యమంలో పాల్గొనబోతున్నట్లు షోలాపూర్‌లో జరిగిన ఒక కాంగ్రెస్ సభలో ప్రకటించాడు తర్వాత జాతీయోద్యమాలలో పాల్గొంటూనే చదువు కొనసాగిస్తూ పూణే విశ్వవిద్యాలయం నుంచి ఎం.ఎ. డిగ్రీ తీసుకున్నారు.

ఒకవైపు భారతదేశ స్వాతంత్ర్యం కోసం మరో వైపు హైదరాబాద్ సంస్థాన విముక్తి కోసం పోరాడారు వ్యక్తి సత్యాగ్రహంలోనూ ఈస్ట్ ఇండియా ఆందోళన లోనూ పాల్గొని జైలుశిక్ష అనుభవించి పోస్ట్-హైదరాబాద్ విమోచన ఆందోళనలలో పాల్గొని జైళ్ళకు వెళ్ళారు 1947 ఆగస్టు 15 వ తేది భారతదేశానికి స్వాతంత్ర్యం లభించింది 1948 సెప్టెంబరులో హైదరాబాద్ సంస్థానం కూడా నిరంకుశ నిజాం పాలననుంచి విముక్తిపొందింది హైదరాబాద్ సంస్థాన విముక్తితో తన జీవితాశయము నెరవేరిందని రామానందతీర్థ భావించలేదు హైదరాబాద్ సంస్థానం విచ్ఛిన్నమవ్వాలని – తెలుగు, మహారాష్ట్ర, కన్నడ భాషలు మాట్లాడే ప్రజలు సంబంధిత రాష్ట్రాలలో విలీనం కావాలని ఆయన ఆశయం హైదరాబాద్ రాజధానిగా హైదరాబాద్ రాష్ట్రంలోని తెలుగు మాట్లాడే తెలంగాణా జిల్లాలు - మద్రాస్ రాష్ట్రంలో తెలుగు మాట్లాడే కోస్తా, రాయలసీమ జిల్లాలలో విశాలాంధ్ర ఏర్పడాలని ఆయన వాదించి విశాలాంధ్ర ఉద్యమాన్ని పూర్తిగా బలపరిచారు

1953-56 మధ్య కొందరు ప్రముఖ తెలంగాణా నాయకులు విశాలాంధ్రను వ్యతిరేకిస్తూ ప్రత్యేక తెలంగాణావాదాన్ని చేస్తున్న సమయంలో అప్పటి ముఖ్యమంత్రి బూర్గుల రామకృష్ణారావు పల్లూరి బసవ రాజు ప్రభృతులతో కలసి ఆంధ్రప్రదేశ్ అవతరణకు రామానందతీర్థ కృషి చేశారు గౌ॥ అప్పటి ప్రధాన మంత్రి నెహ్రూదగ్గర తనకుగల పలుకుబడిని వుపయోగించి ఆంధ్రప్రదేశ్ అవతరణకు ఆయనను సుముఖునిగా చేయడంలో రామానందతీర్థ గణనీయమైన కృషి చేశారు 1969-71 మధ్య ప్రత్యేక తెలంగాణా ఉద్యమం ఉధృత రూపం దాల్చినప్పుడు ఆయన ఎంతో కలవరపడ్డారు ధైర్యంగా ప్రత్యేక తెలంగాణా ఆందోళనను నిరసించారు

విద్యుత్ సన్యాసాన్ని స్వీకరించడానికి ముందు రామానందతీర్థ కొంతకాలం ఒక గురుకులంలో పని

బాలుర నడుమధ్య బాలుండె నేనను
బాల భానుడు గాదె పర్తిసాయి ।
మాతృమూర్తుల మధ్య మాతను నేనను
జగదంబ యనుగాదె సాయిమాత ।
పురుషుల నడుమధ్య పురుషుండ నేనను
పురుషోత్తముడుగాదె పూజ్యసాయి ।
ఏకాంత మందున ఈ ధరాస్థలి నేలు
జగదీశ్వరుడుగాదె సత్యసాయి ।
సత్య - ధర్మ - ప్రేమ శాంతిసుఖంబులు
ప్రేమ మీర పంచి పెట్టు సాయి
ఇంట - వెంట - మనసు - జంటగానుండిన
చాలును - ఇపుడున్న - జన్మచాలు ।

- ఏకా రామచంద్రరావు

చేసేవారు, ప్రధానోపాధ్యాయుడు ఆయనే. విద్యార్థులలో ఉపాధ్యాయులలో ఆయన వినూత్న పద్ధతిలో క్రమ శిక్షణ నెలకొల్పేవారు ఏ విద్యార్థి అయినా తప్పు చేస్తే తనలోనే ఏదో లోపం భావించేవారు - తనదే బాధ్యత అని అనుకునేవారు అందుకు నిష్కృతిగా ఉపవాసం చేసేవారు ఇది విద్యార్థులపైనా శిష్యులపైనా అమోఘంగా పని చేసేది వారు సమవిధులపట్ల ఎంతో బాధ్యతాయుతంగా వ్యవహరించేవారు దండనల వలన సాధించలేని విజయమిది

ఆయన ఆ పాఠశాలలో పనిచేసే సమయంలో జీతం తీసుకునేవారు కాదు, తన అన్న వస్త్రాలకు సరిపడ్డ కొద్దిపాటి మొత్తాన్ని మాత్రం తీసుకునేవారు ఐతే పాఠశాల పాలకవర్గం ప్రతినెలా ఆయనకు వచ్చే జీతాన్ని బ్యాంకులో ఆయన పేరిట డిపాజిట్ చేసింది సన్యాసాశ్రమాన్ని స్వీకరించగానే తన పేరిట వున్న డబ్బును – పేద విద్యార్థులకు పంచిపెట్టి త్యాగంలో ఎంత ఆనందముంటుందో ఆయన స్వయంగా అనుభవించారు

## శ్రీసాయివాణి

వచ్చినచో పోనట్టిది జ్ఞానము,
పోయినచో రానట్టిది మాయ
రాక పోకలు లేనిది బ్రహ్మము.

వదల వలసిన దానిని వదలాలి,
తెలుసుకోవలసిన దానిని తెలుసుకోవాలి
చేరవలసిన గమ్యాన్ని చేరుకోవాలి,
అంతవరకు శాంతి లభించదు.

విజ్ఞతకు పరిమావధి స్వేచ్ఛ
జ్ఞానమునకు పరమావధి ప్రేమ,
సంస్కృతికి పరమావధి పరిపూర్ణత్వము
విద్యకు పరమావధి శీలము

ఆయన రెండుసార్లు లోక్‌సభకు ఎన్నికయ్యారు అంతకుపూర్వం స్టేటు కాంగ్రెస్ ప్రెసిడెంటుగా పని చేశారు ఖాదీ, సర్వోదయ ఉద్యమాలలో పనిచేశారు, కార్మిక విద్యార్థి ఉద్యమాలలో పని చేశారు ఏ పని చేసినా ఆయన సామాన్య ప్రజల శ్రేయస్సునే కోరాడు ప్రజా సేవకు పదవులు, హోదా వుండాలని ఆయన అనుకోలేదు ఇచ్చిన పదవులను ప్రజా సేవకు సాధనాలుగా వినియోగించుకున్నారు

ఆనాటికే దేశంలో పెరిగిపోతున్న హింసాప్రవృత్తి నైతిక పతనం ఆయనను కలవరపరచాయి పెరిగిపోతున్న హింసాప్రవృత్తి ముందు ప్రజాస్వామ్యం తలవంచవలసిన పరిస్థితులు ఏర్పడుతున్నందుకు ఆయన ఆందోళన చెందేవారు ఈ హింసాప్రవృత్తిని, దౌర్జన్య చర్యలను అనుభవజ్ఞులూ బాధ్యతగల నాయకులు ప్రేరేపించడం పట్ల ఆయన మరింత ఆందోళన కలిగించేది అధికారంలో వున్నవారు హింసను ప్రేరేపించడం - దానికి జవాబుగా ప్రతిహింసా - యిలా గొలుసుకట్టుగా సాగిపోతుంటే దేశంలో శాంతిసామరస్యాలు నెలకొని ప్రగతిని సాధించడం ఎట్లా సాధ్యం అని ఆవేదన చెందేవారు

దేశానికి రాజకీయ స్వాతంత్ర్యం వచ్చినా ఆర్థిక స్వాతంత్ర్యం రాలేదని, పేద ప్రజల కడగండ్లు తొలగలేదని ఆవేదన చెందేవారు. దారిద్ర్యం అనారోగ్యం సాంఘిక అసమానతతో మగ్గిపోతున్న కోట్లాది దరిద్రనారాయణులను ఆర్థికంగా పునరుద్ధరించుకున్న నాడే దేశానికి నిజమైన స్వాతంత్ర్యం వచ్చినట్లు అనేవారు ఆయన ప్రజాస్వామ్యంలో ఆయనకు పూర్తి విశ్వాసం వుండేది ప్రజాస్వామ్యంలో భిన్నాభిప్రాయాలు అనివార్యం. అది ప్రజాస్వామ్య చైతన్యానికి ప్రతీక కూడా అయితే ఈ విభేదాలను నూటికి నూరుపాళ్ళు - ప్రజాస్వామ్య పరిస్థితులలో సామరస్య ధోరణిలో పరిష్కరించుకోవాలని హింసా దౌర్జన్యాలకు తావు వుండరాదని ఆయన దృఢంగా నమ్మేవారు. ప్రజాస్వామ్యాన్ని సుస్థిరం కావాలంటే బలహీన వర్గాలకు న్యాయం కలగాలని సైనిక నియంతృత్వం అణచివేత చర్యల ద్వారా సమ సమాజాన్ని స్థాపించడం స్వార్థం కాదని సంక్షేమ పథకాల ద్వారానే దాన్ని స్థాపించవచ్చునని ఆయన భావించేవారు బడుగు రైతులను భూస్వాముల కోరలనుంచి రక్షించిననాడే నిజమైన వ్యవసాయిక ప్రగతి సాధ్యం అని భావించేవారు

రామానందతీర్థకు భారతీయ సంస్కృతికి ప్రాతిపదిక అయిన ఉపనిషత్తులంటే ఎనలేని గౌరవం తేనత్యక్తేన భుంజీథా అనే ఉపనిషత్తు వాక్యంలో ఆయనకు పూర్తి విశ్వాసం వుంది త్యాగం వల్లనే ఆనందం లభిస్తుంది. హృదయం పునీతమవుతుందని భావించి తన జీవితాన్ని అందుకే అంకితం చేశారు అహింసా సిద్ధాంతం పట్ల ఎంతో విశ్వాసం అహింసా సిద్ధాంతం వెనుక ఒక మహత్తర ఆశయబలం ధార్మిక ప్రేరణ వున్నాయని ఆర్థిక అసమానతలను సాంఘిక దురాచారాలను - మత విద్వేషాలను - ఈనాడు ఎదుర్కొంటున్న అన్ని సమస్యలను అహింసా మార్గంతో పరిష్కరించవచ్చునని ఆయన విశ్వాసం

రామానందతీర్థ నిష్కామ కర్మయోగి ○

# మాండవ్యుడు

మల్లాప్రగడ శ్రీరంగారావు

మాండవ్యుడను ఒక మునియుండెను ఇతడు చాలాకాలము తీర్థయాత్రలు చేసి చివరకు ఒక పట్టణ ప్రాంతమునందున్న అరణ్యమందు తపస్సు చేసికొనుచుండెను ఒకనాడు కొందరు దొంగలు రాజధనమును దొంగిలించి మాండవ్యుని ఆశ్రమమునకు వచ్చి ఒక చోట దాగియుండిరి రాజభటులు తఱుముకొనుచు వచ్చి ఆ యరణ్యప్రాంతమంతయు గాలించి మాండవ్యుని దొంగలెచ్చటికి పారిపోయిరని అడుగగా ఆ ముని మౌనము వహించెను చివరకు ఆ ఆశ్రమమందే దొంగలను వెదకి పట్టుకొని మునివేషములో నున్న మాండవ్యుడు పెద్ద దొంగగా భావించి బంధించి రాజు కడకు తీసికొనిపోయిరి రాజు దొంగలను శిక్షించి మాండవ్యమునికి కొఱత వేయించెను ఆ ముని తపో మహిమచే ప్రాణముల విడువక ఆ కొఱత మీదనే మరల తపస్సు చేసుకొనుచుండెను

కొందరు మునులకీవార్త తెలిసి మారువేషములతో వచ్చి "మహాత్మా" మీ వంటి తపస్సంపన్నులకు యీ దారుణమైన శిక్ష యెట్లు సంభవించెనని అడుగగా జన్మాంతర ప్రారబ్ధమేదో కారణమైయుండునని బదులు పలికెను రాజభటులా మాటలు విని రాజునకు తెలియ చేయగా తాను నిర్దోషియైన మహర్షిని అనాలోచితంగా బాధించితినని తెలుసుకొని ముని వద్దకు వచ్చి క్షమింపుడని ప్రార్థించి భటులచేత ఆ కొఱత తీసివేయించుటకు ప్రయత్నించెను కాని ఆ కొఱత పూర్తిగా ఊడి రాక ఆ ముని కంఠమునందు కొంత భాగము మిగిలిపోయింది అందువల్లనే ఆ మునికి అణిమాండవ్యుడను పేరు వచ్చింది

ఒకనాడు మాండవ్యముని తపస్సు చేసుకొనుచుండగా చీకటిలో సుమతి యను పతివ్రత తన భర్తయైన కౌశికుని భుజముపై మోసుకొనిపోవుచుండెను ఆ కౌశికుని పాదము చీకటిలో కనపడనందున మాండవ్యునకు తగిలి మరింత బాధ కలిగించి మాండవ్యుడాబాధ భరింప లేక తన పుండును రేపి బాధ కలిగించినవాడు సూర్యోదయము కాగానే మరణించునని శపించాడు ఆ శాప వాక్యములు విని ఆ కౌశికుని భార్య సూర్యుడుదయింపకుండ ప్రతిజ్ఞ చేసెను. ఆ పతివ్రత వాక్యానికి కట్టుబడి సూర్యుడుదయింపలేదు లోకమంతా అంధకారబంధురమై కర్మలన్నియు నశించి అస్తవ్యస్తమైంది ఈ ఉపద్రవానికి ఆ పతివ్రత శాపం కారణమని బ్రహ్మాది దేవతలు ఆమె వద్దకు వచ్చి "అమ్మా! నీ ఒక్క పతి కొరకు లోకాన్ని బలిచేయడం ధర్మమా! సూర్యోదయమే లేకపోతే ధర్మ కర్మలన్ని తారుమారైపోతాయి. సూర్యోదయానికనుమతింపుమని ప్రార్థించారు నా భర్తయే మరణించునపుడు లోకంతో నాకేం పని సూర్యోదయం వల్ల నా భర్త మరణిస్తాడు గనుక సూర్యోదయానికి అనుమతించనన్నది అపుడు దేవతలందరు "తల్లీ! సూర్యుడుదయించగానే మరణించిన నీ భర్తను మేము బ్రతికించగలం నీవు సూర్యుని ఉదయించునట్లనుగ్రహింపుమని కోరగా ఆమె అనుమతించుటయు, మాండవ్యుని శాపమువల్ల మరణించిన కౌశికుని దేవతావర్గము బ్రతికించుటయు జరిగెను లోకం శాంతించింది

మాండవ్యుడుమాత్రం తనకీ శిక్షకు కారణమేమిటో తెలుసుకోవాలని యమపట్టణానికి వెళ్ళి యమధర్మరాజు

నడిగాడు. 'చిన్నతనంలో తూనీగలను బట్టుకొని వానిని యీ విధంగానె కొఱ్ఱు వేసి బాధించితివి. ఆ పాప ఫలము ఇపుడు నీవనుభవించవలసివచ్చింది" అని యముడు చెప్పెను

మాండవ్యుడు కోపించి అంత చిన్న నేరానికి ఇంత తీవ్రమైన శిక్ష విధించుట నీకు న్యాయం కాదు ప్రేతరాజా! దీని ఫలితంగా నీవు మానవుడవై శూద్ర కులమందు పుట్టగలవని శపించెను ఆ శాపముచేతనే యముడు విదురుడుగా జన్మించెను శూద్రుడుగా జన్మించినా ధర్మదేవతా స్వరూపుడు గనుక ధృతరాష్ట్రునకు పలు రీతుల ధర్మబోధ చేసి నీతి మార్గమున ప్రవర్తింప చేయుటకు ప్రయత్నించి తనకర్తవ్యము నిర్వర్తించాడు ఈ భారత గాధ వలన ప్రారబ్ధ కర్మ చాలా బలవత్తరమైనదని, ఎంతటివాడైనా ప్రారబ్ధమును భరింపక తప్పదని మనం గ్రహించవలసివున్నది ౦౦౦

---

బాలవాణి.

# బళ్ళు తెరిచారు

-సోమంచి రామం

కొత్తగ బడిలో చేరేవారు
బిత్తర చూపులు చూసేరు
ఉత్త పుణ్యానికే ఉడికిస్తే
ఉక్కిరి బిక్కిరి అవుతారు ||రం||

పై తరగతిలో కెళ్ళినవాళ్ళు
పట్టశక్యం కాకుందురు
అదే తరగతి తప్పినవాళ్ళు
పడే బాధ కంతే ఉండదు ||రం||

అబ్బాయిలూ! మూసిన బడులే తెరిచారూ!
అమ్మాయిలూ! తెరచిన బడులే పిలచాయీ!
రండోయ్!...రండోయ్!!...రండోయ్!!!

వేసవి సెలవలు వెళ్ళాయి
వేడిమి ఎండలు తగ్గాయి
వేడుక మీరగ వెడదాం
చదువు సంగతి పడదాం!... ||రం||

కొత్తవారిని బిత్తర చేయక
తప్పినవారిని తప్పులు పట్టక
అంతా కలసి మెలసి పోదాం
సంతోషంగ కాలం గడిపేద్దాం ||రం||

పాత పుస్తకాలను దాచేద్దాం
కొత్త పుస్తకాలను కొనేద్దాం
చిత్తు పుస్తకాలను అమ్మేద్దాం
అచ్చు పుస్తకాలకు అట్టేద్దాం ||రం||

ఉదయం పది గంటలకే
పదిలంగ బడికి పోదాం
ఎండైనా, నీడైనా, ఏమైనా
జండా వందనం చేసేద్దాం! ||రం||

తరగతి కొచ్చే పంతుళ్ళకు
తప్పకుండ నమస్తే చెప్పేద్దాం!
పంతుళ్ళు చెప్పే పాఠాలకు
సంతస మెపుడు చూపేద్దాం! ||రం||

చీకటి పడకుండగనే
చక చక యింటికి పోదాం
చల్లని నీటితో స్నానం చేసి
మెల్లగ వెచ్చని బువ్వ తిందాం! ||రం||

పెందలకడనే పరుండి
పెందలకడనే మేల్కొని
ఉదయం నుండే హుషారుగ
ఆ దినపు పనులన్నీ చేసేద్దాం ||రం||

# చాణక్యుని మాణిక్యాలు

— కె. ఎస్. రత్నాకర్

జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, మనసు కలిసి ఏకాదశ శరీర సామ్రాజ్యాల్ని ఏర్పరచుకున్నాయి కాని దేహ మహాసామ్రాజ్యంలోని భాగాలే ఇవి వీటి ప్రవృత్తులు మానవుని మనుగడని, సామాజికజీవనాన్ని సాంఘిక సంస్కృతులని నిర్దేశిస్తాయి వీటికి ఒక రీతి, ఒక నీతి కల్పించేది శరీరాన్ని ఇచ్చిన తల్లిదండ్రులు. చుట్టూవున్న ప్రపంచం కాని ఆలోచనాశక్తి, విచక్షణా దృష్టి పెరుగుతున్నప్పుడు మానవుడు, ఈ ఇంద్రియ కార్యాల్ని ప్రలోభంవైపు కాకుండా, ధార్మిక ప్రభావం వైపు తిప్పాలి ఇందుకు కొన్ని సూత్రాలు చాణక్యుడు ప్రతిపాదించాడు అలా వుండకపోతే ఏమవుతుందో కూడా చెప్పాడు

## రాజ్యమూలమింద్రియ జయం

రాజ్యాల్ని సంపాదించడమంటే, కోరినవి పొందడం అన్నమాట ఇది మామూలు వస్తువు కాదు ధనధాన్య వస్తు భోగాలతోపాటు సకల జన సంపదని కూడా పొందడం ఇందుకు భుజబలం, అంగబలం కారణా లయితే, ఇంద్రియనిగ్రహం మూలశక్తి అవుతుంది ఇంద్రియాల్ని జయించినపుడే రాజ్యాన్ని ఏలే అర్హత వుంటుందని కూడా చాణక్య వాక్యాలు చెబుతాయి

## ఇంద్రియవశ వర్తి చతురంగానపి వినశ్యతి

ఎంత అంగబలం వున్నప్పటికీ, ఇంద్రియ వటుడు, తన నాశనాన్ని తానే కోరి తెచ్చుకున్నవాడవుతాడు ఇంద్రియములనే గుర్రాలకి మనసనే శేతు, దేహ రథాన్ని జాగరూకతతో నడిపితేనేకాని గమ్యాన్ని చేర లేమని అంటుంది యశోపనిషత్తు ఏ ఇంద్రియ మూల మున కర్మలు, జ్ఞానం సాధిస్తాయో అవి విపరీత ధోరణిలో పడితే జీవితం నిషిద్ధ కర్మలలోనూ, విపరీత జ్ఞానంతోనూ కలుషితమై, అల్పాయుష్షు పొందుతుంది.

## సకామాసక్తస్య కాగ్యానుష్ఠానమ్

కర్మబద్ధమైన జీవితం, కర్మలలో పుట్టి, కర్మల తోనే పెరిగి, కర్మలతోనే క్షీణిస్తుంది కర్మ వర్జిత మైన జీవితం లేదంటుందిగీత "కర్మానుబంధీనిమనుష్య లోకే" అన్న శ్రీకృష్ణపరమాత్మ "యోగః కర్మసుకౌశలం" అని కూడా అన్నాడు అంతేకాదు ఫలాపేక్షరహిత కర్మ చేయమని కూడా ఆదేశించాడు అలాంటప్పుడు, కామసమ్మిశ్రితమైన మానవుడు కార్యోన్ముఖుడు కాలేడు అంటాడు చాణక్యుడు ఇక్కడ కామాన్ని శారీరక మానసిక వికల పరిస్థితిగా సూచించాడు

## న చలచిత్తస్య కార్యావాప్తి

ఇంద్రియములు ప్రకృతిరీత్యా జడములు. వాటికి చలనం, చపలం కలుగజేసేది చిత్తం అందుకనే "యోగశ్చిత్తవృత్తినిరోధః" చిత్తవృత్తిని నిరోధించేది యోగం అని పతంజలి మహర్షి అన్నాడు శమ, దమ, ఉపరతి, తితీక్షలు మానవోన్నతికి సాధనాలని ఉపనిషత్తులు ఘోషిస్తున్నాయి సంకల్ప స్థానమైన వికలమైనా, చపలమైనా కార్యసాధననేది జరుగదు ఊగిసలాడే మనసు కలవాడు, ఊపిరికూడా తీయలేడు కార్యాచరణలో లోపం వుందంటే అట్టి మనిషికి మానసిక ధారుఢ్యం లేదని గ్రహించాలి. దీన్నే చాణక్యుడు కార్యప్రాప్తి కలుగు చపలచిత్తులలో అంటాడు

( తరువాయి 40 వ పేజీలో )

# ధూపం ఆఘ్రాపయామి

డా॥ రావర్త జనార్ధనరావు

మన పూజల్లో దైవానికి చేసే అర్చనలలో "గంధం ధారయామి" అని మంచిగంధం దైవానికి సమర్పిస్తాము. అలాగే ధూపమాఘ్రాపయామి" అంటూ అగరవత్తుల ధూపం చూపిస్తాము ఇది మన సంస్కృతిలో సుగంధానికి ఇచ్చే ప్రాధాన్యతను తెలియజేస్తుంది ఎంతటి నిరక్షరాస్యుడైనా, తన కార్యక్రమంలో మొదటి భాగంగా దేవతల పటాలకు ఇంటిలో అగరు వత్తులు వెలిగించి ఇంటి వాతావరణాన్ని అంతా సుగంధ యుతం చేస్తాడు దేవాలయాలలో ఈ సుగంధ వాతావరణమే భక్తులకు కొంత మానసిక ప్రశాంతిని కలుగ జేస్తుంది తిరుపతి శ్రీ వెంకటేశ్వరస్వామివారి గర్భ గుడిలో అడుగుపెట్టగానే, భక్తుడు తన కోరికలు కూడా మరచి తన్మయుడైపోతాడు గర్భగుడిలో స్వామివారి ఊర్ధ్వపుండ్రములు పచ్చకర్పూరంతోనూ, కస్తూరి, పునుగు, జవ్వాజి మొదలైన సుగంధ ద్రవ్యాలతో స్వామివారి స్వరూపానికి అలదటం వలన ఆ సుగంధం భక్తులనందర్నీ పవిత్రవాతావరణంతో తన్మయుణ్ణి చేస్తుంది పండుగలకూ, పెళ్ళిళ్ళకూ, పదిమంది కలసిన ఉత్సవాలలో అత్తరు, అగరువత్తుల ధూపంతో ఆనంద దాయకం చేస్తారు దేవుడు "పరిమళ ప్రియః" పరిమళ ప్రియుడేనని చెప్తారు

హిందువులే కాదు. మహమ్మదీయులు, క్రైస్తవులు తమతమ పూజాస్థలాలలో ధూపాన్ని వెలిగించి వాతావరణాన్ని పరిశుద్ధం చేస్తారు క్రైస్తవులలో కాథలికులు సాంబ్రాణి ఇతర ద్రవ్యాలను ఒక భరిణెలో వెలిగించి దానికి గొలుసులు కట్టి ఊపుతూ దేవాలయం అంతా తిరుగుతారు. మహమ్మదీయులు అత్తరుసెంట్లు మున్నగు ద్రవ్యాలు ఎంతో హెచ్చుగా వాడటం మనం చూస్తూ ఉంటాము

## అగరు

(Aquliaria Agallocha) కృష్ణాగరు రాజార్హ, కాలీఅగర్ అంటారు మనోహరముగ నుండి, శ్లేష్మము వాతము దుర్గంధమును పోగొట్టును క్రిమిసంహారకము నరములకు సత్తువచేస్తుంది, అగరు చూర్ణము (పరిశుద్ధమైనది) తేనెలో కలిపి ఇస్తే ఎక్కిళ్ళు కట్టిస్తుంది, అగరు తైలం శిరోరోగాన్ని తగ్గిస్తుంది

(Styrax Benjoin) లోబాన్, ఊద్ అంటారు హిందీలో ఊదువత్తులు అనే పేరు "ఊద్" నుండి వచ్చింది ఇది త్రిదోషహరం దేవతా ప్రీతికరం, మనస్సునకు సంతోషాన్ని కలిగిస్తుంది గ్రహబాధా నివారకం క్రిమిహరం దీని ధూపం కురుపులు, వ్రణాన్ని శాంతింపజేస్తుంది స్త్రీలు శిరస్నానం చేసిన పిదప సాంబ్రాణి పొగ పెట్టటం అనే మంచి అలవాటు ఇప్పుడు కొరవడిపోతోంది అలాగే పసిపిల్లల మంచం క్రింద సాంబ్రాణి ధూపం పెడుతూఉంటాము

## కస్తూరి

Moschus - ఎంతో సుగంధం కలిగిఉంటుంది, కస్తూరి సూతికావాతాన్ని పోగొట్టుంది. కస్తూరిమాత్రలు పూర్వం అందరి ఇళ్ళలో ఉంచుకుని అవసరానికి వాడేవారు. ఇది గాయం తగిలితే వచ్చే సంధి (Tetamus)ను రాకుండా చేస్తుంది అందుకే బాలింతలకు తమలపాకుల్లో పెట్టి ఎమిలిస్తారు. కస్తూరి కర్పూర విడెములలో పెట్టి

స్వామివారికి అర్పించటం ఆచారం భయము,విచారాన్ని నివృత్తి చేస్తుంది

## మంచిగంధం

(Santalumt, Sandalwood) శ్రీగంధం అని అంటారు మనోహరమైన సుగంధాన్ని కలుగజేస్తుంది. దీని గంధం అరగదీసి స్వామివారికి పూజల్లో సమర్పిస్తాం కండ్లకు చలువజేస్తుంది తాపం, జ్వరం తొలగించి శాంతిని కాంతిని కలుగజేస్తుంది క్రిమిరోగాల్ని హరిస్తుంది, కురుపుల మీద గంధం అరగదీసి అంటిస్తే తాపం తగ్గిస్తుంది, దురద పొక్కులు, పేలుడు, చెమట తగ్గిస్తుంది చందిని అత్తరు చేస్తారు చందనాది తైలం స్నానానికి పూర్వం ఒంటికి రాచుకుని స్నానం చేస్తే ఎంతో ఆహ్లాదాన్ని కలుగజేస్తుంది "గంధ ధారా దురా దర్షాం" అని గంధాన్ని పురోహితునికి ఇచ్చిన తర్వాత కార్యక్రమాలు మొదలవుతవి ప్రతివారి ఇంటిలో మంచి గంధపు చెక్క సాన ఉండేవి ఇవి ఎంతో ఉపయోగకరంగా ఉండేవి దేవుడు గుళ్ళల్లో గుండు చేయించుకున్నవారు గంధం పైన వ్రాసికోవాలి మధ్వులు గంధాన్ని కణతలకు వ్రాసుకుంటారు అదే విలువబొట్టుగా పెట్తారు

## పచ్చకర్పూరం

( Refined Camphor ) హిందీలో ' కాపూర్ ' అంటారు కర్పూరంలోంచి శుద్ధిచేసి తీస్తారు సువాసన కలిగి పిండివంటల్లో వాడుతారు బుద్ధిని హెచ్చిస్తుంది దగ్గు క్షయ వ్యాధుల్ని తగ్గిస్తుంది ఎండ పడినప్పుడును ఆకలిదప్పులు అధికమైనప్పుడు, తాపము పుట్టినప్పుడు ఇది కొద్దిగ సేవించినచలువ చేయును.

## జవ్వాది

(Livet) ఇది పిల్లి జాతి మృగముయొక్క మదము త్రిదోషహరము నేత్రి రోగము, కుష్ట, మతిహీనతలను తొలగించును చెమటను పోగొట్టును దీని ధూపము భూత ప్రేత పిశాచములను తొలగచేయును

## జటామాంసి

( Valeriana jatamansi ) మహాశాంతి కలుగజేస్తుంది మనోహరమైన సుగంధం కలది. ఏసుక్రీస్తు జన్మించినపుడు తూర్పు దేశవాసులు జటామాంసి మొదలైన సుగంధద్రవ్యాలు "బెత్లెహేం"లోని పల్లితండ్రులకు సమర్పించారు బైబిలులో తరుచుగ పేర్కొనబడుతుంది గుండె దడ తగ్గిస్తుంది మూర్ఛ, అపస్మారము (Hysteria) ను తగ్గిస్తుంది

## పునుగు

(Viverra Zibetha) సంస్కృతంలో గంధమార్జారీ అంటారు పునుగుపిల్లి మదము శరీరమునకు పూసుకొనిన సుగంధంగా ఉండును దేహదుర్గంధాన్ని పోగొడుతుంది

ఈ విధంగా ఎన్నో సుగంధ ద్రవ్యాలు ఉన్నాయి. దేవతా పూజలలో ఉపయోగించటం, పెండ్లిండ్లలో వాడటం మనం చేస్తూఉన్నాం సుగంధం వలన లాభం ఏమిటి • మానవప్రకృతి సుగంధాన్ని ప్రేమిస్తుంది దుర్గంధాన్ని అసంహ్యించుకుంటుంది. సుగంధం వలన వ్యక్తి తన శ్వాసకోశాల్లోకి హెచ్చు ప్రాణవాయువును తీసికుంటాడు మనం హెచ్చు ప్రాణవాయువును తీసికొనటం వలన హెచ్చు రక్తప్రసరణ జరుగుతుంది

కొన్ని జంతువుల శరీరాలనుండి ఒక రకమైన దుర్గంధం వచ్చినట్లుగా కొంతమంది వ్యక్తుల శరీరాల నుండి కూడా దుర్గంధం వస్తూఉంటుంది నోటి నుండి కూడా పంటివ్యాధులు ఉంటే వాసనవస్తుంది దీనిని Body odours అంటారు విదేశాలలో, స్త్రీపురుషులు ఇది లేకుండా ప్రత్యేకమైన సెంట్లు వాడుతూఉంటారు వీటిని Spray చేసుకుని బయటకు వస్తారు

సుగంధానికి ఇంత ప్రాధాన్యం ఉంది. నిజమైన యోగి ఎవరు అని అడిగిన ప్రశ్నకు శాస్త్రాలలో ఒక సమాధానం ఇవ్వబడింది అదేమిటంటే నిజమైన యోగికి శ్వేధ మలమూత్రాదులు అంటే చెమట మల

మూత్రములు ఏమీ వాసన వేయక నిర్గంధముగా ఉండా లని చెప్పబడింది.

చక్కని వాసన వచ్చే పూలను ఇంటిలో పెట్టుకొని ఇంటిని పరిమళయుతం చేయాలి పొన్నపూల వాసన ఎంతో ఆహ్లాదకరమైంది శ్రీకృష్ణుడు పొన్నచెట్టు మీద కూర్చుండేవాడట అయితే ఇందులో ఒక రహస్యం ఉంది. మతి పెర్రి ఎత్తించే ఘాటైన వాసనలు పనికిరావు సంపెంగపూలు దేవుని పూజ

( చాణక్యుని... 37 వ పేజీ తరువాయి )

ఇంద్రియాణి జరావశం కుర్వంతి

ఆనందం, ఆరోగ్యం కోరుకుంటాడు మనిషి సంపూర్ణారోగ్యం యౌవ్వనంలోనే అనుభవిస్తారు చిర కాలం ఏ స్థితిగతులు వుండవు కాని ఆరోగ్యం మనిషి వయస్సుని పెరుగనివ్వదు. శారీరక, మానసిక ఆరోగ్యం పెంపొందించుకున్నవాడు చాలా కాలం పుష్టిగా, సంతు

చేయరు గుగ్గిలం కూడా వాడరు

తులసి వెన్ను

తులసిచెట్టుకు విత్తనాలు కొదలవలె వచ్చి ఎండి పోతాయి దానిని తులసి వెన్ను అంటారు ఈ తులసి విత్తనాలు కొద్దిగా చేతిలోనికి తీసుకొని, కొద్దిగా నొక్కి వాసన చూస్తే దీని సుగంధం, వ్యక్తుల్ని దేవలోకపు అనుభూతులు కలుగజేసేదిలాగ ఉంటుంది అందుకనే హిందువులకు తులసిచెట్టు ప్రతి ఇంటా ఉంటుంది ◯

ష్టిగా వుండగలడు పుష్టిని కలిగించేది ఇంద్రియాలు, సంతృప్తిపడేది మనస్సు ఈ రెంటిని యమనియమ ములలో గ్రహించాలి ఏది "అ( అయినా అణు అణువునూ దహిస్తుంది తక్కువ వయస్సులోనే ఎక్కువ అనుభవిస్తే భగవంతుడు "యత్కర్మతత్ఫలం" అంటాడు. అచిరకాలంలో జవసత్వములు ఉడిగిపోవ డం అకాలమృత్యువాత బడడం అప్పుడు

# గురుపూర్ణిమోత్సవ ఆహ్వాన పత్రిక

భగవాన్ శ్రీ సత్యసాయి సమితి ప్రెశిడెంటుకు సాయిభక్తులకు ఆహ్వానము
గుడివాడ పట్టణాంతర్గత శ్రీ వేణుగోపాలస్వామి దేవాలయమందు ది 2-7-93 శుక్రవారం
గురుపూర్ణిమ ఉత్సవ పర్వదినమున సాయిసదస్సుకు అందరూ ఆహ్వానితులే

ది 2-7-93 శుక్రవారం గురుపూర్ణిమ సందర్భముగా సాయినాధుని ఉత్సవమూర్తికి జరుగు అర్చనా కార్యక్రమములు

ఉదయం 5 గం॥ నగర సంకీర్తన
,, 6 గం॥ నుండి సాయంత్రం 6 గం॥ వరకు ఏకాహం జరుగును
,, 6 గం॥ నుండి 8 గం॥ వరకు స్వామి ఉత్సవమూర్తికి పాపుమీటరు ఎత్తుగల ఇత్తడి విగ్రహము నకు 108 బిందెలు గోరువెచ్చని ఉదకాభిషేకము
,, 8 గం॥ నుండి 9 గం॥ వరకు 108 లీటర్ల పాలాభిషేకము
,, 9 గం॥ నుంచి 11 గం॥ వరకు వివిధ రకముల అభిషేకములు జరుగును
,, 11 గం స్వామివారికి విశేష అలంకరణపూజలు
,, 12 గం॥ హారతి, అన్నదానము

సాయంత్రం 6 గం॥కు 108 దీపారాధనలు, 6-30 గం॥కు విష్ణు సహస్ర నామార్చనలు
రాత్రి 8 గం॥కు ఆధ్యాత్మిక సినిమాలు చూపించబడును

పై అభిషేకములు చేయించుకొనగోరు భక్తులు తమ గోత్రనామములు తెలియచేస్తు విరాళములు ఈ క్రింది అడ్రెసుకు MO కాని DD కాని పంపించిన తమ గోత్రనామములతో పూజలు జరిపించి ప్రసాదం పంపబడును.

ఆర్గనైజరు అడ్రసు : శ్రీ సాయి సేవా సమితి, శ్రీ కారంశెట్టి వెంకట సత్యసాంబశివరావుస్వామి
తాజ్‌మహల్ హోటలు ఎదురు బజారు, డోర్ నెం. 12/114, గుడివాడ - 521 301

గమనిక : అన్నదానము నిమిత్తము నూనె, డాల్డా, బియ్యము, పచారి సరుకులు రూపంలో తమ శక్త్యానుసారము ఏ ట్రాన్సుపోర్టుద్వారానైనా పై అడ్రసుకి పంపించ ప్రార్ధన

( 8 వ పేజీ తరువాయి )

కాదు...కాదు...మానవుడు అల్పుడు కాదు, అనంతుడు కనుకనే అట్టి infinitగా ఉండినటువంటి మానవత్వాన్ని ఈనాడు మనం దేహరీతిగా దానిని అదుపులో వుంచటం చేతనే, ఈ దివ్యత్వమయిన విశాలత్వాన్ని మనం అర్థం చేసుకోలేకపోతున్నాం మొట్టమొదట ఈ దివ్యత్వాన్ని మనం గుర్తించాలి నీవెవరవో నీవు అర్థం చేసుకోవాలి కాని ఈనాటి విద్యావిధానం లోపల తనను తాను వదలి విశ్వాన్ని గుర్తించటానికి ప్రయత్నిస్తున్నాడు ఇదియే పెద్ద అజ్ఞానం ఈనాడు విజ్ఞానం ఎంత పెరిగినదో, అజ్ఞానం కూడా అంత పెరుగుతూ వస్తున్నది ఈ అజ్ఞానమును చూడటం లేదు మానవుడు, విజ్ఞానమును మాత్రమే దృష్టియందుంచుకుంటున్నాడు ఇది నిజమయిన విజ్ఞానము కాదు అజ్ఞానములోని ఒక భాగమే ఎంతవరకూ మానవుల మధ్య భేదములు, భిన్నత్వములు వుంటుంటాయో అంతవరకూ వారు అజ్ఞానులే కాని, విజ్ఞానులు కారు Over mind ను దాటిపోవాలి ఇది సాధ్యమా ? అని ప్రశ్నించవచ్చు, తప్పక సాధ్యమే మానవుడు సాధించలేనటువంటిది ఈ జగత్తులో ఒక్కటీ లేదు సర్వమునూ సాధించవచ్చును కాని అట్టి విశ్వాసం మానవునిలో లేకపోవటం చేతనే సాధించలేకపోతున్నాడు

దేహము పరిమితిమయినది. " నేను " అపరిమితమయినటువంటిది. కాబట్టి అపరిమితమయిన దాని ప్రక్కలో పరిమితమయిన దానిని పెట్టుకొని, పరిమితమునే విశ్వసించి, అపరిమితిమును విసర్జిస్తున్నాడు. కనుక మన బలహీనతలకు, మన సందేహములకు అన్నింటికీ మూలకారణము ఈ దేహమే. కనుక -

దేహము పాంచ భౌతికము దేహము
కూలక తప్పదెప్పుడున్
దేహి నిరామయుండు గణుతింపగ దేహికి
చావుపుట్టుకల్
మోహ నిబంధ బంధనల ముద్రలు లేవు
నిజంబు చూడ
దేహియె దేవదేవుగు మదిన్ గణుతింపగ
ఆత్మరూపుడే.

నీవు దేహివే కాని దేహము కాదు నీవు శరీరి కాని శరీరము కాదు నీవు క్షేత్రజ్ఞుడవే కాని క్షేత్రము కాదు క్షేత్రజ్ఞుడే లేకపోతే క్షేత్రమని పేరు ఎలా వస్తుంది? తిరుపతి క్షేత్రం, పర్తి క్షేత్రం, కాశీ క్షేత్రం. ఈ క్షేత్రమని పేరు ఎలా వచ్చింది ? ఏదో ఒక దివ్యమైన శక్తి అందులో వుండటం చేతనే దీనికి క్షేత్రమని పేరు వచ్చింది అదే విధముగ దేహము ఒక క్షేత్రము ఈ క్షేత్రమునకు ఎవరో ఒకరు క్షేత్రజ్ఞుడు ఉండాలి గదా ! అతనే ఆత్మస్వరూపుడు. కనుక మొట్టమొదట క్షేత్రజ్ఞుని గుర్తించాలి ఈ విశ్వాసాన్ని అభివృద్ధి పరచుకోవాలి ఆత్మవిశ్వాసం ఉండినప్పుడే సర్వమునూ మనకు లభ్యమవుతాయి కనుక ఆత్మవిశ్వాసం అత్యవసరం 'నేనే' ఆత్మను అనే విశ్వాసం మూడంగావుండాలి నాకు నా ఎదుటి వ్యక్తికి మధ్యనున్న గోడను తీసివేయాలి నీకు నీ ఎదుటి వ్యక్తికీ మధ్యనున్న భేదము ఏమిటి ? అది దేహము ఈ దేహమనే ఉపాధిని దూరం చేసినప్పుడు రెండూ ఏకమైపోతాయి కనుక ఏకత్వంలో ఉన్నటువంటిదే నిజమైన ఆనందకోశము యొక్క ప్రతిబింబం

అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయకోశములు మానవునికి ఉపాధులే కాని మానవులు కాదు ఎన్నో షర్ట్స్ వుండవచ్చు, ఎన్నో పాంట్స్ వుంచవచ్చును కాని ఇవన్నీ నీ డ్రస్సులే కాని నీవు అదిగా కావు కారులో నీవు ప్రయాణం చేసినంత మాత్రాన కారు నీవవుతావా ? కాదు...కాదు ...కాదు కారు రథము, నీవు రథికుడవు నీవు ఇంటిలో వున్నంత మాత్రన ఇల్లు నీవవుతావా ? నీవు ఇంటి యజమానివి మాత్రమే అదే విధముగనే " దేహో దేవాలయః ప్రోక్తః జీవో దేవ

స్సనాత్మనః ” ఈ దేహమనేటటువంటి ఇంటిలోపల ఈ దేవుడనేటటువంటివాడు వుండటం చేతనే, నీవు దేహాన్ని విశ్వసించి, దేహిని విస్మరిస్తున్నావు నీవు దేహము కానే కాదు నీవు దేహమును ధరించినటువంటి ఉపాధివి దీనిని ఏనాటికైననూ నీవు మార్పు చేయవచ్చును కాని మార్పు కానటువంటివాడే “నేను”. నీవు నిత్యుడవు, సత్యుడవు ఇలాంటి విశ్వాసం మానవునిలో అభివృద్ధి కావాలి, కాని ప్రతి మానవుడు నేను... నేను, నా దేహము-నా దేహము అనే భావముతో ఈ పదమును ఉపయోగపెడుతున్నాడే గాని మానవుడు అంటే ఎవరు ? ఎవరికీ అర్థం కావటం లేదు ఈనాడు అర్థం తెలియని పదములను మానవుడు ఎన్నో ఉపయోగపెడుతున్నాడు అర్థములకోసం డిక్షనరీలలో చూస్తున్నాడు నీ డిక్షనరీ ఎక్కడ ఉండాలి ? అదియే నీ యొక్క హృదయ తత్త్వము అదియే నీ అంతర్భావములో కూడిన శక్తి ఆ దివ్య శక్తిని మార్చాలి ఆ కాస్మిక్ పవర్ అంతా అందులోనే ఉంది ఒక వ్రేలిలో ఎంత శక్తి ఉన్నదో చక్కగా పరీక్ష చేస్తే, యావత్ ప్రపంచం యందుండిన సర్వ శక్తి అంతనూ ఒక్క వ్రేలిలోనే ఉన్నది నీవు వ్రేలిని మాత్రమే ఆధారం చేసుకోవటంచేత అది బలహీనంగా నీకు కనిపిస్తున్నది నీ ఆకారాన్ని నీవు చూడవద్దు యీ ఆకారం చేత మానవులు కావచ్చును గాని ఆచరణ చేత మానవులు కావాలి యీనాడు నూటికి 99 మంది అంతా ఆకార మానవులే కనిపిస్తున్నారు గాని ఆచరణ మానవులు కనిపించటం లేదు ఆచరణలో మనం మానవులం కావాలి దీనినే The proper study of mankind is man అన్నారు Thoughts ( ఆలోచనలు ), Words ( వాక్కులు ), Actions ( చేతలు ) - యీ మూడింటి యొక్క ఏకత్వం జరగాలి. యీ విధమైన శక్తి మానవుని యందే లేకపోతే ఎన్ని విధములైన అద్భుతాలు సాధిస్తూ వస్తున్నాడు మానవుడు

అయితే యీనాడు మానవుని యందు ఒక విధమైన రాక్షసత్వం పశుత్వం అభివృద్ధి అవుతున్నది దీనికి కారణం ఏమిటి ? భిన్నత్వం ... భిన్నత్వం ... ఒక వైపున యీనాడు సాంకేతిక విజ్ఞానశాస్త్రం నిండివిగా పెరుగుతున్నది మరొక వైపున నైతిక, ధార్మిక, ఆధ్యాత్మిక రంగాలలో దిగజారిపోతున్నది ఒక వైపున చూస్తే ఆర్థిక పరిస్థితుల ప్రభావం, మరొక వైపున కుల మతాల మధ్య భిన్నత్వం, ఇంకొక వైపున ప్రాంతీయ దురభిమానం, విద్యార్థుల ఆందోళనలు - ఇవన్నీ రోజు రోజుకు పెరుగుతూవస్తున్నాయి దీనికి మూలకారణమేమిటి ? మానవునిలో పశుత్వ భావనలు పెరగటంచేతనే ఈ భిన్నత్వం అభివృద్ధిగాంచుతున్నది మానవునిలో దైవత్వం, మానవత్వం, పశుత్వం, దానవత్వం - ఈ నాల్గు శక్తులు ఇమిడి ఉన్నాయి మానవత్వాన్ని మరచిపోవటంచేతనే పశుత్వం, రాక్షస భావాలు అభివృద్ధి అవుతున్నాయి మనం తెలివితేటలను పెంచుకుంటున్నామే గాని, ఆత్మతత్త్వాన్ని పెంచుకోవటం లేదు మన knowledge (తెలివితేటలు) ను Skill (నైపుణ్యం) చేసినప్పుడు మాత్రమే, ఇది క్రమక్రమేణా ఒక అంతర్భావంగా రూపొందుతుంది ఈ నాలుగు శక్తులే మానవుని యందు నాలుగు రూపములు ధరిస్తున్నాయి 1 Knowledge 2 Skill 3 Balance 4 Insight ఈనాడు విద్యార్థులు Knowledge ని Skill చేయటంలేదు Kill చేస్తున్నారు Knowledgeని Kill చేయటం వలననే Balance తప్పుతున్నది యీ Balance తప్పటంవలననే insight (అంతర్ దృష్టి) పోయి outlook (బహిర్దృష్టి) పెరుగుతున్నది. యీ outlooks మూలకారణము ఇదే మన నిరంతరం బాహ్యదృష్టిలోనే ఉంటున్నాం బాహ్య దృష్టి ప్రత్యేకమయినది కాదు Reflection of the inner being ( అంతర్‌దృష్టి యొక్క ప్రతిబింబమే బాహ్యదృష్టి) యీ తత్త్వాన్ని గుర్తించాలి యీ Reflection ను చూచి దీనిని Real గా నీవు భావిస్తున్నావు Real (నిజమైన) దానిని మరచిపోతున్నావు చేతిలో వున్నటువంటి పిట్టనే, పొదలో ఒక పిట్ట కనిపిస్తుండాలి కాని యీనాటి మానవుడు పొదలో

వున్న పిట్టను పట్టటంకోసం చేతిలోవున్న పిట్టను వదలి పెడుతున్నాడు మానవుడు ఇంత అజ్ఞానిగా మారి పోతున్నాడు ఇది కాదు మానవత్వానికి సరియైన విశిష్టత తనపైన తాను విశ్వాసం వుంచాలి ఎక్కడెక్కడో వున్నదానిని విశ్వసించటానికి ప్రయత్నించ కూడదు. నీవెవరు ? నీవెవరు ? అని చూచినవారందర్ని ప్రశ్నిస్తున్నావు కాని నేనెవరు" అనే తత్త్వమును మాత్రం తెలుసుకోలేక పోతున్నావు కనుక నే యీ దేహము, మనస్సు, బుద్ధి, అంతఃకరణ -న్నింటిని ప్రశ్నించిచూటూపోతున్నావు ఇవన్నీ యీ నీవు కావులే నీ ఆస్తులే నీవే వాటికి యజమానివి ఇది నా దేహము ఇది నా మనస్సు, ఇది నా బుద్ధి, ఇది నా అంతఃకరణ అంటూ నేనెవరు ? అంటే నీకు తెలియటంలేదు దేహమే నీవని భావిస్తున్నావు ఇది నా ఇల్లు అంటున్నావు ఈ ఇంటిపై ఎవరైనా సినిమా పోస్టర్ వేస్తే, వాడితో జగడం పెట్టుకుంటున్నావు ఇది ఎంతవరకూ నీ అభిమానము ? ఈ ఇల్లు నాది... నాది అనే అభిమానం ఉండినంతవరకు అతనితో జగడం పెట్టుకుంటున్నావు అది అమ్మివేస్తే దానిమీద బాంబు వేసినా నీవు బాధపడవు ఆనాడు పడిన విచార మునకు, ఈనాటి అవిచారమునకు కారణమేమిటి ? అభిమాన దురభిమానములే దీనికి మూలకారణం. కనుక ఈ యొక్క అభిమానమనేటటువంటిది ఇంటిపైన ఒక విధమైన దేహంపైన ఉండకూడదు నీపైన నీకు అభిమానముంటే దేహముకూడా సక్షేమంగా పెరుగుతుంది కాని నీపైన నీకు విశ్వాసంలేక, మిగిలినదంతా అభివృద్ధిపరచాలంటే ఇది అసాధ్యం అదే నిజమైన గొప్పతనం నీపైన నీకు విశ్వాసము, ఆత్మపైన విశ్వాసం Faith in you, Faith in God, that is the secret of greatness యీ గొప్పతనమును మనం తెలుసుకోవాలి యీ రహస్యమును తెలుసుకోవటానికి ప్రయత్నించటం లేదు.

విద్యార్థులారా !

సమస్త విశ్వమూ మీలోనే ఉంటున్నాది వేము కేవలం అల్పులమనికావి, కేవలం మానవ శరీరధారుల మనిగాని భావించకూడదు దేహాలు కేవలం నీటిబుడగల లాంటివి దీని తరువాత వుండే మనస్సు పెద్దకోతి వంటిది కనుక Monkey వంటి mind ( కోతి మనస్సు) ను, నీటిబుడగలాంటి దేహమును విశ్వసించవద్దు విశ్వసించవలసినది నీ కాన్షస్‌నే ఆత్మ విశ్వాసం కలగాలి. అది లేకుండా ఎన్ని విశ్వాసము లుండి ఏమి ప్రయోజనం? శరీరానికి మంచి అలంకారం చేసినావు, నగలు పెట్టినావు వస్త్రాలు కట్టినావు కాని దానికిఉచ్ఛ్వాసనిశ్వాసమ లే లేకుంటే ఏమిప్రయోజనం? దీనికి ఏమి విలువ ? అదే రీతిగనే విశ్వాసమనేది మన శ్వాసము, విశ్వాసము లేని దేహము ఎన్ని ఘన కార్యములు చేసినా ఇది శ్వాసము లేని దేహమే కీ ఇచ్చినబొమ్మ కీ ఉన్నంతవరకు తిరుగుతూఉంటుంది తిరిగినంత మాత్రాన దానికి జీవం ఉన్నదనగలమా ? కాదు - కాదు కీ ఉన్నంతవరకు తిరుగుతుంది దీనికి కీయే Life మానవుడు ఎన్నెన్నో పనులు చేస్తున్నాడు, ఎన్నో ఘనకార్యాలు సాధిస్తున్నాడు ఏది Life, అదియే ఆత్మ అదియే కాన్షస్‌నెస్ ఆ కాన్షస్‌నెస్ అనేది లోపల ఉంటంచేతనే ఈ దేహం ఇన్ని పనులు చేస్తున్నది ఈ కాన్షస్‌నెస్సే "నీవు! ఆ కాన్షస్‌నెస్సే భౌతిక రూపంలో ఏ విధంగా వ్యక్తమవుతున్నది ; సో . హం . ఇదే మనయొక్క కాన్షస్‌నెస్ సోఽహం, అనగా. I am God, I am God ఈ కాన్షస్‌నెస్ అంతర్యామిగా బోధిస్తుండాలి దీనినే హంస గాయత్రి అని పేర్కొన్నారు హంస అనగా ఏమిటి ? మంచి చెడ్డలను విభాగం చేసేది హంస అనగా దేహాత్మ భావం. జీవాత్మ భావమును వేరుగా చేస్తుండాలి అనగా ఇది ఉపాధి - దేహము ఇది ఆధారము - దేహి దేహి దేహములను విభాగము చేసేది హంస ఏమిటి ఈ గాయత్రి ? గాయత్రి అనగా Master of senses

ఈ గాయిత్రికే రెండవ పేరు సావిత్రి ఇదే Master of life మూడవ పేరు సరస్వతి వాగ్దేవతాస్వరూపిణి కనుకనే Senses ( ఇంద్రియములు ) కు Master, Life (ప్రాణం) కు Master. వాక్కుకు Master అయినటువంటి తత్త్వము గాయిత్రీ తత్త్వము, నీలో ఉచ్ఛ్వాస నిశ్వాసములలో ఉంటుండాలి. దీనినే ఓం భూర్భువస్సువః అన్నారు. ఓం .. Body శరీరము, భువః Life (ప్రాణం) మూడవది సువః - ప్రజ్ఞ దీనినే రేడియేషన్, వైబ్రేషన్, మెటీరియలైజెషన్ అన్నారు రేడియేషన్ అదియే ప్రజ్ఞాశక్తి, వైబ్రేషన్ అదియే ప్రాణశక్తి దేహమే మెటీరియలైజేషన్. ఓం భూర్భువస్సువః అనేది ఎక్కడో భూలోకమో, భువర్లోకమో స్వర్గలోకమోకాదు మన దేహమే భూర్భువస్సువర్లోకము మూడులోకములు మనయందే ఉంటున్నాయి ముమ్మూర్తులు మనయందే ఉంటున్నాయి. మూడు కాలములు మనయందే ఉంటున్నాయి కనుకనే మానవుడు సామాన్యుడు కాదు మానవుడు సాక్షాత్ చైతన్య స్వరూపుడే. ఇలాంటి దివ్యత్వమైన మానవత్వాన్ని (కాస్మిక్ డివైన్) మనం అలక్ష్యం చేస్తున్నాం తుచ్ఛమైనటువంటి అల్పమైనటువంటి ప్రాకృతమైనటువంటి సుఖముల నిమిత్తమై ఈ దివ్యత్వాన్ని మనం పాడుచేసుకుంటున్నాం మాణిక్యంవంటి మానవత్వాన్ని మసిబొగ్గులకు అమ్ముకుంటున్నాం మాణిక్యం మాణిక్యంగానే ఉంటుండాలి అది నిరంతరమూ ప్రకాశించేటటువంటిదే. దీనికి ఏ సమయంలోనూ ఏ విధమైన మార్పులూరావు. దానినే "తత్" అన్నారు "తత్" అనగా Being ఉన్నది ... ఉన్నది మార్పు చెందేది కాదు కనుక అట్టి మానవత్వాన్ని మనం గుర్తించటానికి ప్రయత్నించాలి మానవుడు మాధవుడే

" దేవుడనగ వేరు దేశమందున లేడు
దేవుడుండు తనదు దేహమందె
పాపమనగ వేరు పరదేశమున లేదు
తాను చేయు పనుల దగిలియుండు "

కనుక పుణ్యం కాని, పాపము కాని అన్నీ మన దేహములోనే ఉంటున్నాయి మనలో దివ్య భావము ఉంటే మంచి కార్యములు చేస్తాము పశుభావములుంటే పశుకార్యములు చేస్తాం కనుక మనలోనున్న భావం మార్పు రావాలి పరిణామం అనేది మనస్సుకు అతీతంగా పోవాలి మనస్సుతో ఉండినంత మనలో మాలిన్యమే చేరి ఉంటుంది ఈ మాలిన్యం పోవాలంటే పరిశుద్ధమైన "చిత్" స్వరూపం లోపల దీనిని పరిశుద్ధం గావించాలి ఏమిటి ఈ "చిత్", "చిత్" అనగా Awareness అనగా పరిపూర్ణమైన అవగాహన ఇది ఏమిటని ప్రశ్నించినప్పుడు గుడ్డముక్క అంటారు ఇది కాదు Awareness ఇది గుడ్డముక్క అని చెప్పటంవలన సర్వమూ తెలిసినదని అనుకోగూడదు ఇదియే అహంకారము దీనిని పూర్తిగా విప్పి చూచినప్పుడు దీనిని చేతిరుమాలా అంటాం. ఇది Awareness దీని స్వరూపాన్ని పరిపూర్ణంగా తెలుసుకొనినప్పుడే Awareness అంటారు ఆదేవిధముగా మానవత్వాన్ని పరిపూర్ణంగా అర్థం చేసుకొనినప్పుడే దీనిని Awareness అని చెప్పవచ్చు ఈనాడు మానవత్వం అంటే ఏమిటో తెలియటంలేదు నేను అన్నీ తెలుసుకున్నాననుకోవటం కేవలం పెర్రితనం కనుక ఇది Awareness కాదు Awareness ఎప్పుడూ "సత్" తో కూడి వుంటుంది అనగా Awareness ఎప్పుడూ శాశ్వతమైనదానితో చేరి ఉంటుంది "సత్"కు ప్రక్కన ఎప్పుడు "చిత్" ఉంటునే ఉంటుంది కనుకనే "సత్" శాశ్వతమైన సత్యం "చిత్" శాశ్వతమైన ప్రజ్ఞానం. ఈ రెండింటినీ మనం అర్థం చేసుకొనినప్పుడే "ఆనందం" మనలో ఆవిర్భవిస్తుంది దీనినే సత్, చిత్, ఆనందం" అన్నారు దీనిని వేదాంత పరిభాషలో "అస్తి, భాతి, ప్రియం" అన్నారు ఈ రెండింటి మధ్య లోపల రూపనామములు చేరటంచేత ఈ యొక్క సత్, చిత్, ఆనందంయొక్క ప్రకాశముకూడా కొంత

వరకు కోల్పోతున్నాయి కనుక మనం ఆధారమును ఆధారముగా తీసుకోగూడదు

మన వైస్ ఛాన్సలర్ మానవత్వమునకు, మాధవత్వమునకు సంబంధమును కొంతవరకు స్వామి బోధించాలన్నాడు దీనికి ఏమాత్రం భిన్నత్వమే లేదు Relationship ఏ మాత్రం లేదు Reality ఉంటుండాలి. అది ఒకటి ఇది ఒకటి వేరుగా ఉన్నప్పుడే Relation ship వస్తుంది రెండూ ఒకటే అయినప్పుడు Relation ship ఎక్కడ వుంటుంది ? మానవుడు, దేవుడు, జీవుడు, దేవుడు, క్షేత్రం, క్షేత్రజ్ఞం అన్నీ ఏకత్వంలోనే ఉంటున్నాయి కనుక ఏకత్వాన్ని గుర్తించాలి అప్పుడే నిజమైనటువంటి మానవత్వం మనకు అర్థమవుతుంది. ఇలాంటి విశాల భావములు ఈనాడు గుర్తించుకోపోవటం చేతనే ప్రపంచంలో అనేక భిన్నత్వములు, అనేక ద్వేషములు, బాధలు అభివృద్ధి అవుతున్నాయి ఎక్కడ చూచినా అశాంతే ఆందోళనలే బయలుదేరుతున్నాయి దీనికి మూలకారణం భిన్నత్వమే స్వార్థం అభివృద్ధిఅయినప్పుడే బేధములు అభివృద్ధిగాంచుతున్నాయి కనుక మానవునిలో వున్నటువంటి ఈ స్వార్థం నశించాలి పరార్థమును పెంచుకోవాల్సి యదార్థమును గుర్తించాలి ఈ నానార్థముల లోని సత్యాన్ని అర్థం చేసుకోవాలి కనుక సత్యం అన్నింటికీ ఒక్కటే దీనికి తేడా లేదు, బేధమూ లేదు. సత్యం ఒక్కటే అదే Truth is God సత్యమైన మార్గంలో ప్రవేశించాలి కనకనే భారతీయ సంస్కృతిలో "సత్యం వద" "ధర్మం చర" ఈ రెంటినీ రెండు నేత్రాలుగా భావించి విజ్ఞాన ప్రబోధలు సలుపుతూ వచ్చారు ఈనాటి మానవునకు యీ రెండు కన్నులు పోయినాయి కనుకనే తనను తాను రక్షించుకోలేక పోతున్నాడు. కారణం ఏమిటి ? దృష్టి లేదు యీ దృష్టిలోపల కారణమే లేకుండా పోవటానికి కారణం ఏమిటి ? తాను కేవలం సృష్టిలో ఉన్నానని భ్రమిస్తున్నాడు సృష్టిలో నీవు లేవు నీలోనే సృష్టి ఉంటుండాలి నేను సృష్టిలో ప్రవేశించటం లేదు నీ నుంచే సృష్టి ప్రవేశిస్తుండాలి కనుక ఇలాంటి సత్యమును గుర్తించాలి నేను జీవుడుగా వుండి సాధనలచేత దేవుడిలో ప్రవేశిస్తున్నానని భ్రమించకూడదు నేను ఆత్మలో ప్రవేశిస్తున్నానని భ్రమించకూడదు ఆత్మ నుండియే నీవు ఈ జగత్తులో ప్రవేశించాననే సత్యాన్ని గుర్తించాలి. నీవు ఆత్మనుండి వచ్చినటువంటివాడివి కాని, ప్రకృతి నుంచి ఆత్మలో ప్రవేశించినట్టివాడివి కావు కనుక Worship a picture as a God but not God as a picture This cloth is God, this flower is God, this plate is God - వీటన్నింటిని పైకి పంపివేయి అంతేగాని God is cloth, God is flower, God is plate అని క్రిందకు దింపకు. Look up ... ఉన్నత స్థాయిలోనికి నీవు పోవాలి Low aim is crime లోపలికి దిగవద్దు పైకి వెళ్ళండి ఉన్నత స్థాయిని చేరుకొనేందుకు ప్రయత్నించండి "ఊర్ధ్వమూల మధఃశాఖ మశ్వత్థం" అని భగవద్గీత కూడా చెబుతుంది

కనుక మనం ఎవ్వరిని ఏ విధంగా కూడనూ బాధించకూడదు. ఎవరిని హింసించకూడదు అందరియందును ఉండినటువంటి ఆత్మతత్త్వము ఒక్కటే ననే సత్యాన్ని గుర్తించాలి మానవత్వంలో ఇంకా ఎలాంటి పవిత్రమైన శక్తులున్నాయో ముమ్ముందు మనం విచారించుకుందాం (రాబోపు ప్రసంగాలలో)

ఈ సత్యాలను విద్యార్థులు చక్కగా గుర్తించి జగత్తుకు ఆదర్శప్రాయులుగా నిలిచి, ఈ సత్యాన్ని యావత్ ప్రపంచానికి చాటి, ప్రపంచంలో శాంతి భద్రతలను నెలకొల్పాలి మనం కేవలం ఒక్క భారతదేశమే శాంతిగా వుండాలని కోరకూడదు అదియే

Narrow mind (సంకుచిత మనస్తత్వం) "లోకాస్సమస్తా సుఖినోభవంతు" అందరూ సుఖంగా వుండాలి అందరి సుఖములోనే నీ సుఖము కూడా ఆవిర్భవిస్తుంది లోకం ఎటు పోతేమి ! నా సుఖం నాకు కావాలని ఆశించకూడదు లోకములో వున్నవారందరిలోనూ నీవూ ఒక వ్యక్తివే ఇలాంటి సమిష్టి భావంతో, విశాల భావంతో, అనంతమైన భావంతో మీరు మీ భావాలను పవిత్రపరచుకోవాలి కేవలం లౌకిక చదువులు చదివినంతమాత్రమున చాలదు ఈ చదువులంతా దేనికి? జానెడు పొట్టకోసం ఈ చిన్ని పొట్టను నింపుకోవటానికి ఇంత చదువులు చదవాలా ? ఈ సత్యాన్ని గుర్తించుకుంటే అప్పుడే సాక్షాత్కారం లభిస్తుంది.

చదువులన్ని చదివి చాల వివేకియై
మదిని తన్నె ఋగడు మందమతుడు
ఎంత చదువు చదివి ఏ రీతి నున్నను
హీనుడవగుణంబు మానలేడు

తరచి చదువు చదవ తర్కవాదమె కాని
పూర్ణజ్ఞానమెపుడు పొందలేడు
చదువులన్నియు చదివి చావంగ నేటికి
చావులేని చదువు చదువవలయు

ఏమిటి ఈ Education ? ఈ Education ఎక్కువ కావటం వలననే Agitation కూడా ఎక్కువైపోతున్నది Education తో పాటు Elevation కావాలి మనకు అదియే మన ఆదర్శం అదియే నిజమైన విద్య "ఆధ్యాత్మిక విద్యా విద్యానాం" లౌకిక విద్యలు కూడా కావాల్సిందే భుజించాలంటే అన్నం ఒకటే ఉండాలి అది ప్రధానం అయితే అన్నంతోపాటు కూర, పులుసు, పచ్చడి కొన్ని పదార్థములు కూడా కలుపుకోవటానికి అవసరం గదా ! అదే విధముగనే ఆధ్యాత్మిక విద్య అనే అన్నమును మనం తయారుచేసుకోవాలి దీనితోపాటు లౌకిక, భౌతిక ధార్మిక విద్యలనే కూరలను చేర్చుకోవాలి ఇవన్నీ జిహ్వాచాపల్యం కోసం చేస్తున్నావు, నీ భ్రాంతుల కోసం చేస్తున్నావు నీ వాంఛల కోసం చేస్తున్నావు వాంఛలు చల్లార్చుకున్నప్పుడే మనస్సు స్తంభించిపోతుంది అప్పుడే అమనస్కుడైపోతావు అదియే over mind, ఈ over mind అనేటటువంటిదానిని Eliminated mind, Higher mind, Superier mind లను గురించి ముమ్మందు మనం తెలుసుకోవాలి అన్నింటియొక్క అర్థములు తెలుసుకొనిన తరువాతనే పూర్ణత్వం ఏకమైపోతుంది

కనుక ఆధ్యాత్మిక మార్గం అత్యవసరమైనది భౌతిక విద్యలన్ని మీ క్లాసురూములలో చదువుతూనే ఉన్నారు. ఆధ్యాత్మికతను గురించి తెలుసుకోవటానికోసమే ఈ వేసవి తరగతులు ఏర్పాటు చేయబడినాయి. ఇది ప్రధానమైనది "నదీనాం సాగరో గతిః" నదులు అనేక రూపనామములలో ప్రవహిస్తున్నాయి కాని సముద్రం ఒక్కటే ఫిజిక్స్, కెమిస్ట్రీ, మాథ్స్-ఇవన్నీ వివిధ నదులవంటివి. ఇవన్నీ చేరి ఆధ్యాత్మిక విద్య అనే సముద్రంలో ఏకమైపోవాలి అదే భిన్నత్వంలోని ఏకత్వం అన్నింటియందున్న ఏకత్వాన్ని గుర్తించాలి. ఈ విధమైనటువంటి ఏకత్వం లోపల, దైవ చింతన చేస్తూ, ఈ వేసవి తరగతులలో మీ హృదయాలను పవిత్రమైన పరివర్తన చేసుకొని తద్వారా ఈ లోకమునకు తగిన రీతిగా చాటటానికి పూనుకోవాలి. నిస్వార్థమైన జీవితాన్ని గడపాలి ఈ విధంగా గడపటానికి ఒక ఆధ్యాత్మిక మార్గం తప్ప వేరొకటి లేదు.

(ది 20-5-1993 న బృందావన్‌లో జరిగిన వేసవి తరగతులలో భగవాన్ బాబావారు చేసిన ప్రథమ దివ్య ప్రసంగం నుండి)